శ్రీః

మహాకవి భారవి ప్రణీతము

# కిరాతార్జునీయము

ఆంధ్ర 'బాలసుధా' వ్యాఖ్యా సహితము

ప్రథమ సర్గము






వ్యాఖ్యాత :

డాక్టర్ పాటిబండ మాధవశర్మ

ఆంధ్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము



ప్రకాశకులు :

శ్రీ పరమేశ్వర పబ్లికేషన్సు

చిక్కడపల్లి - హైదరాబాదు - 20

# విన్నపము

సంస్కృత భాషా సాహిత్యముల యధ్యయనము యొక్క విలువను, ఆవశ్యకమును ప్రజలు, ప్రభుత్వము, విద్యాధికారులు, విద్యార్థులు ఇప్పుడిప్పుడు గుర్తించు చున్నారు. ఆ భాషయందలి కావ్యములను, నాటకములను చదివి యానందింపవలెనని పలువురు ఉత్సాహ పడుచున్నారు. అయినను కావ్య నాటకములు స్వయముగా చదువుకొని యర్థము చేసికొని యానందించుటకు తగినంత భాషాజ్ఞానమును సంపాదించుటకు పలువురకు అవకాశము లభింపదు. అట్టివారికి ఉత్తమ సంస్కృత నాటకములను ఆంధ్రలిపిలో, ఆంధ్రానువాద, వ్యాఖ్యానములతో అచ్చువేసి అందజేయుట ఉచితము, అవసరము అని తోచి మేము ఆ కార్యమునకు పూనుకొంటిమి.

సంస్కృత కావ్యములందలి కొన్ని సర్గములను గూడ సంస్కృత సాహిత్యాభిమానులయిన యాంధ్ర పాఠకులకు అందుబాటులోనికి దెచ్చుటకును గొంత ప్రయత్నము చేయుచున్నాము. పదవిభాగ, అన్వయ, ప్రతిపదార్థ, తాత్పర్యములతో పాటు కొంత వ్యాఖ్యానము కూడ చేర్చి రఘువంశాది కావ్యములందలి సర్గములను ప్రకటింపవలెనని పూనుకొంటిమి.

పంచతంత్రము, దశకుమార చరిత్రము, హర్షచరిత్రము మున్నగు గద్య గ్రంథములను ఆంధ్రానువాద సహితముగా ప్రచురించుటకును పూనుకొని యున్నాము.

విశ్వవిద్యాలయము నిర్వహించు పరీక్షలకు చదువు కొను విద్యార్థుల ప్రయోజనములను గూడ దృష్టియం దుంచుకొని ఈ ప్రచురణములు సిద్ధము చేయబడు చున్నవి. వీనిని అధ్యాపకులు, సంస్కృత భాషా సాహి త్యాభిమానులైన యాంధ్ర రసజ్ఞులు ఆదరింతురనియు, మా యుద్యమమును ప్రోత్సహింతురనియు ఆశించు చున్నాము.

మా ప్రయత్నము యొక్క సాఫల్యమునకు ఆంధ్ర రసజ్ఞులే ప్రమాణము.

—ప్ర కా శ కు లు



# ప రి చ య ము

## భా ర వి కా ల ము

సంస్కృత సాహిత్యమున ప్రౌఢకావ్య నిర్మాతలుగా ప్రసిద్ధులైన మహాకవులలో భారవి యొకడు. ఈతని రచనగా ఒక్క కిరాతార్జునీయము మాత్రమే లభించుచున్నది. ఈ కావ్యమును బట్టి భారవి వంశకాలాదికము లెవ్వియు తెలియరావు. క్రీ. శ. 634 నాటి ఐహోల్ శాసనమునందలి యొక శ్లోకమున భారవి పేర్కొనబడియున్నాడు.

''యేనాయోజి నవేఽ శ్మస్థిరమర్థవిధౌ వివేకినా జినవేశ్మ
స విజయతాం రవికీర్తిః కవితాశ్రిత కాళిదాస భారవికీర్తిః''

ఈ శ్లోకమునుబట్టి భారవి క్రీ. శ. 634 నకు పూర్వమే జీవించి యుండెనని తెలియుచున్నది. క్రీ. శ. 580 ప్రాంతముల పరిపాలించిన దుర్వినీతుడను రాజు భారవి కృత కిరాతార్జునీయ మందలి 15వ సర్గమునకు వ్యాఖ్య రచించినట్లు పరిశోధకులు చెప్పుచున్నారు. కనుక భారవి అంతకు కొంచమేని ముందే ఉండి యుండవలెను.

రెండవ పులకేశి కుమారు న చంద్రాదిత్యుని భార్య విజ్జిక. ఆమె కౌముదీ మహోత్సవము అను నాటకము రచించెను. ఆమె వాక్యముగా నొక శ్లోకము గలదు.

''నీలోత్పలదళశ్యామాం విజ్జికాం మా మజానతా
వృథైవ దండినా ప్రోక్తా సర్వశుక్లా సరస్వతీ''

విజ్జిక కాలము 660 ప్రాంతముగా నిర్ణయింపబడినది. అపర సరస్వతి యైన తాను నీలోత్పలవర్ణయై యుండుట తెలియంగక దండి

సరస్వతి సర్వశుక్ల యని వ్యర్థముగా పలికెనని యీామె చమత్క-రించెను. కనుక దండి 660 నాటి వాడో, కొంచెము తరువాతివాడో అయి యుండవలెను,

దండి తన అవంతి సుందరీ కథయందు తాను భారవికి ముమ్మనుమడైనట్లు చెప్పికొని యున్నాడు. దండి కాలము క్రీ. శ. 670 అని నిర్ణయింపబడినది గనుక ఆయన ముత్తాతయైన భారవి ఒక వంద యేండ్లు వెనుక—అనగా క్రీ. శ. 570 ప్రాంతముల జీవించి యుండెనని నిర్ణయింపవచ్చును.

భారవి కౌశిక గోత్రుడైన బ్రాహ్మణుడు. ఆయన తండ్రియైన నారాయణస్వామి గుజరాతు నందలి ఆనందపురము నుండి బీరారు నందలి అచలపురమునకు వలసపోయెను. భారవి అసలు పేరు దామోదరుడు. సూర్యునివలె ప్రకాశించు మేధాశక్తి గలవాడగుటచే ఆయనకు భారవి యను లక్షణనామధేయము కలిగెను. సింహవిష్ణువు అను పల్లవ రాజు ఆహ్వానముపై భారవి అతని రాజధానియైన కంచి కేగి ఆతని యాస్థాన కవిగా నుండెను. భారవి కొడుకు మహారథుడు. ఆతని కొడుకు వీరదత్తుడు. వీరదత్తునకు గౌరి యను భార్యయందు జన్మించినవాడే దండి మహాకవి.

## ఒక గాథ

భారవిని గూర్చిన యొక చిత్రమైన ఐతిహ్యము కలదు. దాని యాథార్థ్య మెట్లున్నను అది యర్థవంతము, రమణీయము ననుట నిజము.

భారవి పేదయింట జన్మించినవాడు. తన దారిద్ర్యమును గూర్చి భార్య చేయు అధిక్షేపములు సహింపజాలక భారవి యొకనాడు ధనార్జనము సేయ తలంపుతో బయలుదేరెను. మార్గ మధ్యమున నొక

సర స్తీరమున విశ్రమించి యప్పుడు స్ఫురించిన యొక శ్లోకమును ఒక తామరాకుపై లిఖించెను.

ఆ ప్రాంతముల వేటాడవచ్చిన రాజు ఆ శ్లోకమును పఠించి భారవిని మిగుల ప్రశంసించి వీలు చూచుకొని యొక పర్యాయము తన భవనమునకు రమ్మని చెప్పి వెడలిపోయెను. ఆ శ్లోక మిది-

'సహసా విదధీత న క్రియా
మవివేకః పర మాపదాం పదం
వృణుతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః'

ఈ శ్లోకమును రాజు సువర్ణాక్షరములతో వ్రాయించి తన శయన మందిరమునం దుంచుకొనెను. తన యదృష్టము పండినదని సంతసించిన భారవి యొకనాడు రాజమందిరమున కరిగెను. కాని యాతని దరిద్రవేషము చూచి ద్వారపాలకు లాతనిని లోనికి బోనీయరైరి. ఇట్లు కొంత కాలము గడచెను.

మరల నొకనాడు రాజు వేటకు బోయి నిర్ణీత సమయము కంటె ముందే యాకస్మికముగ దిరిగి వచ్చెను. శయన మందిరమును ప్రవేశించి తన శయ్యపై రాణి యెవ్వనినో ఆలింగనము చేసికొని నిద్రించుచుండుట కాంచెను. క్రోధావేశము పొంగివచ్చి రాజా యిరువురును సంహరింప కత్తినెత్తెను. దైవికముగా నా క్షణమునం దతని దృష్టి గోడపై స్వర్ణాక్షరములతో లిఖింపబడియున్న శ్లోకము మీద ప్రసరించెను. వెంటనే అతని మనస్సు కుదుటబడెను. శయ్యపై నిద్రించుచున్నవారిని మేల్కొలిపి, వారి ఘోరాపచారమును వారికి తెలిపి, మరి శిక్షించుట తగునన్న తలంపు రాజునకు కలిగెను. నిద్రలేపి విచారించగా రాణితో ఏకశయ్యపై నున్నవాడు యువరాజని తెలిసినది. శైశవముననే అపహృతుడైన రాజకుమారుడు నాటి

సాయంకాలమే తిరిగి లభించెను. చిరకాలమునకు లభించిన పుత్రుని విడువలేక తల్లి యాతనిని తన శయ్యపై బరుండ బెట్టుకొనెను. తన్ను మహా విపత్తునుండి రక్షించిన యా శ్లోకము రచించిన భారవిని రాజు వెదకి తెప్పించి ఘనముగా సత్కరించెను.

## మహాకావ్యము

భారవి రచనగా కిరాతార్జునీయము మాత్రమే కానవచ్చుచున్నది. ఇది సంస్కృత పంచ కావ్యములలో నొకటి. కాళిదాసుని రఘువంశ కుమారసంభవములు, భారవి కిరాతార్జునీయము, మాఘుని శిశుపాల వధ, హర్షుని నైషధము సంస్కృతమున పంచ మహాకావ్యములుగా ప్రఖ్యాతములు. మహాకావ్య లక్షణము దండి చెప్పినది—

''సర్గబంధో మహాకావ్య ముచ్యతే తస్య లక్షణం
ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖం
ఇతిహాసకథోద్భూత మితరద్వా సదాశ్రయం
చతుర్వర్గ ఫలోపేతం చతురోదాత్త నాయకం
నగరార్ణవశైల ర్తు చంద్రార్కోదయ వర్ణనం
ఉద్యాన సలిల క్రీడా మధుపానరతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
మంత్ర దూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి
అలంకృత మసంక్షిప్తం రసభావ నిరంతరం
సర్గై రనతి విస్తీర్ణైః శ్రవ్యవృత్తైః సుసంధిభిః
సర్వత్ర భిన్నవృత్తాంతై రుపేతం లోక రంజకం
కావ్యం కల్పాంత సంస్థాయి జాయతే సదలంకృతి.''

ఈ లక్షణమును బట్టియే మహాకావ్యము అష్టాదశ వర్ణనాత్మకమై యుండవలయునన్న సంప్రదాయ మేర్పడినది. కాళిదాస భారవ్యాదుల

కావ్యముల ననుశీలించియే దండి ఈ మహాకావ్య లక్షణము ఏర్పరచి యుండెను.

కాళిదాసుని కావ్యములందీ వర్ణనలలో పెక్కు కలవు కాని అవి ప్రధాన కథ గమనమునకు అడ్డు తగులని తీరున సంక్షిప్తముగా సుందరముగా తీర్చబడి యున్నవి. భారవి కిరాతార్జునీయము వర్ణనా బహుళము. వర్ణనలు కొన్ని పట్ల అతి విస్తీర్ణములు. కథాంశము అతి స్వల్పము. విస్తృతములు, బహుళములు అయిన వర్ణనలలో పడి కథాంశము మునిగి పోయినదా యనిపించును.

మహాకావ్య లక్షణములను, వాని గుణదోషములను నిర్వచించి నిరూపించు సందర్భమున పలువు రాలంకారికులు భారవి కిరాతార్జునీయము ఉదహరించియున్నారు. హేమచంద్రు డను అలంకారికుడు ప్రత్యేకాభినివేశముతో మహాకావ్య లక్షణములకు కిరాతార్జునీయము నుండియే ఉదాహరణములు చూపియున్నాడు.

మహాకావ్యము నందలి సర్గ సంఖ్యను, సర్గమునందలి శ్లోక సంఖ్యను గురించి ఈశానసంహిత యిట్లనుచున్నది.

''అష్టసర్గా న్న తు న్యూనం త్రింశత్సరాచ్చ నాధికం
నాత్యంత విస్తరః సర్గః త్రిశంతో వా న చోనతా
ద్విశత్యా నాధికం కార్య మేతత్సర్గస్య లక్షణం''

మహాకావ్యమునందు సర్గములు ఎనిమిదికి తక్కువగాని ముప్పదికి ఎక్కువగాని కాగూడదు. సర్గమునందలి పద్యముల సంఖ్య ముప్పదికి తగ్గరాదు; రెండువందలకు మించరాదు. కిరాతార్జునీయమున పదునెనిమిది సర్గములు కలవు. సర్గమందలి పద్య సంఖ్యయు నియమానుసారముగనే యున్నది.

కిరాతార్జునీయ కావ్యము నందలి వస్తువు వ్యాసకృత మహాభారతము అరణ్య పర్వము నుండి గ్రహింపబడినది. మహాకావ్యోచితము

లయిన చిరుమార్పులు చేయబడినవి. ఒకటి, రెండు సర్గములందలి మార్పులలో ముఖ్యమైనవి—

ధర్మరాజు వనచరుని గూఢచారిగా నియమించుట. వాడు విషయమంతయు దెలిసికొని వచ్చి శత్రు విఘాతమును గుఱించి ఏకాంతమున గూర్చుండి విచారించుచుండిన ధర్మరాజును దర్శించుట, దుర్యోధనుని ప్రజారంజకమగు పరిపాలనా విధానమును విపులముగా వర్ణించుట భారవి కల్పించిన యంశములు.

ధర్మజాదులు తమ కష్టములను గుఱించి చెప్పికొనుచు, దుఃఖోపశమన కారకములగు కథలతో కాలక్షేపము చేయుచుండగా ద్రౌపదీ భీమసేనులు శాంతిని వీడి శత్రుసంహారమునకు సిద్ధపడుమని ధర్మజుని ప్రబోధించినట్లు మూలము.

మూలమున ద్రౌపదీ ధర్మజులకు క్షమావలంబనమునుగూర్చి విధివిధానమునుగూర్చి కొంత వివాదము జరిగినట్లున్నది. ప్రథమసర్గమున ద్రౌపది యుపన్యాసమును, ద్వితీయ సర్గమున భీముని యుపన్యాసమును ధర్మజుడు మౌనముగా వినినట్లును, కోపావిష్టుడైన భీముని శాంతపఱచుటకు నీతి తత్త్వమును గూర్చి కొంత ప్రసంగించినట్లును భారవి మార్చి యున్నాడు.

బలిప్రహ్లాదసంవాదము, బ్రాహ్మణులు ద్రుపదునకు జెప్పిన నీతిప్రకారము, బ్రహ్మ తన పుత్రులకు జెప్పిన కర్మఫల సంబంధము మున్నగు నంశములనుగూర్చి మూలమున ద్రౌపదిచేసిన ప్రసంగమును భారవి విడిచిపెట్టెను.

ఒకటి, రెండు సర్గల యందలి వస్తువు విపులముగా గ్రంథాంతమున నీయబడి యున్నది.

## నాయకుడు

కిరాతార్జునీయమున నాయకు డెవ్వడు ?

"సర్గబంధో మహాకావ్యం తత్రైకో నాయకః సురః

సద్వంశః క్షత్రియో వాపి ధీరోదాత్త గుణాన్వితః
ఏకవంశభవా భూపాః కులజా బహవోఽపివా.

అని సాహిత్య దర్పణము చెప్పుచున్నది. దివ్యుడు గాని ధీరోదాత్త లక్షణములుగల క్షత్రియుడు గాని ఒకడు నాయకుడు కావలెను. ఒకే ఉత్తమ వంశమున బుట్టిన పలువురైనను నాయకులు కావచ్చును.

''కిరాతశ్చ అర్జునశ్చ కిరాతార్జునౌ; తౌ అధికృత్య కృతం కావ్యం కిరాతార్జునీయం''—కిరాతార్జునుల నిరువురును అధికరించి చేయబడిన కావ్యము కిరాతార్జునీయము. 'నామ కార్యం నాటకస్య గర్భితార్థ ప్రకాశకం' అను సాహిత్య దర్పణోక్తి ననుసరించి నాటకమునకు (కావ్యమునకును) కావ్యమున గర్భితమైన యర్థమును ప్రకాశింపజేయు తీరున నామకరణము చేయవలయును. కిరాతార్జునీయము అను నామకరణము చేయుటవల్ల కిరాతార్జునుల యుద్ధము ఈ కావ్యమునప్రధాన విషయ మగుచున్నది. కావ్యమున ఫలమున కధికారి యగువాడే నాయకుడు, కిరాత వేషమందున్న ఈశ్వరుడు పొందిన ఫల మింకేమియు లేదు. పాశుపతాస్త్ర రూపమైన మహాఫలమును పొందినవాడు అర్జునుడే. కనుక అర్జునుడే నాయకుడు. అతని ప్రతాపమునకు ఉత్కర్ష కలిగించుటకు ప్రతిభట రూపమున ఉపకరించిన వాడు ఈశ్వరుడు.

అర్జునుడు ఉత్తమ క్షత్రియ వంశమున జన్మించి ధీరోదాత్త లక్షణములు గల ఉత్తమ నాయకుడు.

''మహా సత్త్వో ఽతిగంభీరః క్షమావా నవికత్థనః
స్థిరో నిగూఢాహంకారో ధీరోదాత్తో దృఢవ్రతః.

ఈ ధీరోదాత్త లక్షణములు అర్జునునియందున్నవి. ధర్మరాజునందున్నవి. పాండవులలో మధ్యముడైన యర్జునుడు నాయకుడనుటకంటె అగ్రజుడైన ధర్మజుడే నాయకుడనుట యుక్తమని కొందరందురు. ఫల మనగా పాండవుల విజయమనియు దానికి అధికారి

ధర్మజుడే కనుక అతడే ఈ కావ్యమున నాయకుడనియు, కనుక కావ్యా రంభమున మూడు సర్గములందు ధర్మజునికే ప్రాధాన్యము కలిగించె నని వారి యభిప్రాయము. పాండవ విజయఫలమైన రాజ్యలాభము నకు పాశుపతాస్త్ర లాభము సాధనము మాత్రమే కనుక దానికి అధి కారియైన అర్జునుడు ఉపనాయకుడే యగునని వారందురు.

కాని కిరాతార్జునీయ మని నామకరణము చేసిన భారవి ఈ కావ్య మున అర్జుననే నాయకునిగా భావించెనని చెప్పదగును. మల్లినాథసూరి మహోదయుని వాక్యము పరమప్రమాణముగా గ్రహింపదగినది.

''నేతా మధ్యమ పాండవో భగవతో నారాయణ స్యాంశజః
తస్యోత్కర్షకృతే త్వవర్ణ్యతతరాం దివ్యః కిరాతః పునః
శృంగారాది రసోఽంగ మత్ర విజయీ వీరః ప్రధానో రసః
శైలాద్యాని చ వర్ణితాని బహుశో దివ్యాస్త్రలాభః ఫలం''

భగవంతుడైన నారాయణుని యంశమున బుట్టిన మధ్యమ పాండవుడైన యర్జునుడే నాయకుడు. మరి ఆతని యుత్కర్ష కొరకే దివ్యుడైన కిరాతుడు అతిశయముగా వర్ణింపబడినాడు. ఈ కావ్యమున శృంగారాది రసములు అంగములు. యుద్ధవీరము ప్రధానరసము. శైలాదు లెన్నో విపులముగా వర్ణింపబడినవి. ఫలము పాశుపతాస్త్ర లాభము.

ఈశ్వరుడు, నారాయణుడు-ఇరువురును దివ్యులే. కాని ఈశ్వ రాంశమైన కిరాతుడు ఆటవికుడు, నారాయణాంశమైన యర్జునుడు ఉత్తమ క్షత్రియుడు. కనుక ఇరువురిలో అర్జునుడే నాయకుడు కాదగును. మరి కిరాతుని ప్రతాపము నంతగా వర్ణింపనేల యనగా ఆతనిని ఎది రించి నిల్చిన యర్జునుని ప్రతాపమునకు ఉత్కర్ష కలిగించుటకు. దండి చెప్పెను గదా-

'వంశ వీర్య ప్రతాపాదీన్ వర్ణయిత్వా రిపోరపి
తజ్జయా న్నాయకోత్కర్షా కథనం చ ధినోతి నః'

శత్రువుయొక్క వంశ వీర్య ప్రతాపాదులను వర్ణించి యాతనిని జయించుట వల్ల నాయకుని యుత్కర్షను తెలియజేయుటయు మాకు సమ్మతమే అని నాయకవర్ణనమున నొక వక్రమార్గమును గూడ దండి సూచించెను. భారవి యవలంబించిన మార్గమిది. భారతము విష్ణు మహిమ ప్రతిపాదకము. అందు శివ మహిమయు వర్ణితమగును. కాని యా వర్ణనము విష్ణుమహిమ కుత్కర్ష కలిగించుటకే. పాశుపతాస్త్ర లాభము నపేక్షించి యర్జునుడు తపస్సుచేయ నరుగు సందర్భమును వర్ణించు ఈ రెండు సర్గము లందును అర్జునుని ప్రాధాన్యము స్పష్ట పడుచునే యున్నది. గనుక నాయకుడు అర్జునుడే యని నిష్కర్ష.

## కవిత్వము

భారవి కవిత్వము అర్థగౌరవము గలదని ఈ క్రింది యాభాణకము తెలుపు చున్నది.

"ఉపమా కాళిదాసస్య భారవే రర్థ గౌరవం
దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయో గుణాః.

ఈ శ్లోకమందలి యితరాభిప్రాయముల యాథార్థ్య మెట్లున్నను భారవిని గూర్చిన యభిప్రాయమున గొంత సత్యము కలదన వచ్చును. అర్థ గౌరవము భారవి కవిత ప్రధాన లక్షణము. ఆయన యభిరుచి యట్టిది. ద్వితీయ సర్గము నందలి యీ శ్లోకములను చూడుడు—

"స్ఫుటతా న పదై రపాకృతా న చ న స్వీకృత మర్థగౌరవం
రచితా పృథగర్థతా గిరాం న చ సామర్థ్య మపోహితం క్వచిత్"
"ఉపపత్తి రుదాహృతా బలా దనుమానేన న చాగమః క్షతః
ఇద మీదృగనీదృగాశయః ప్రసభం వక్తు ముపక్రమేత కః?"

పదములు స్పష్టతను వీడలేదు. అర్థగాంభీర్యము స్వీకరింప బడక యుండలేదు. వాక్కులు భిన్నార్థములుగా రచింపబడినవి. అనగా పునరుక్తిలేదు. పదముల పరస్పర సాకాంక్షా రూపమైన సామర్థ్యము ఎచ్చటను విడువబడలేదు. శక్తిమంతముగా ఉపపత్తి చూపబడినది.

అనుమానముచే శాస్త్రీయము తిరస్కృతము కాలేదు. నీవంటివాడు తప్ప ఇట్లు అప్రయత్నముగా పలుక నెవ్వడు సమర్థుడగును ?

నీమ నేనుని వాక్యములను గూర్చి ధర్మరాజు వెలిబుచ్చిన యీ లక్షణములు భారవి కవిత పట్ల కూడ సత్యములే. పరోక్షముగా భారవి తన వాక్య లక్షణములనే ప్రకటించుచున్నాడా యనిపించును. వ్యాఖ్యాన సాహాయ్యమున భారవి శ్లోకములందలి యర్థ గౌరవమును పాఠకులు గుర్తింపగలరు.

కాళిదాసుని శైలి సుకుమారము, మధురము నైనది. శ్రవణ మాత్రమున ఆహ్లాదము గలిగించునది. భారవి శైలి పరుషము, జటిలము. ఓజోగుణ మాయన శైలి ప్రధాన లక్షణము. కాళిదాసుశైలి బహిరంతః స్ఫురద్రసమై ద్రాక్షాపాకమున నుండును. భారవి శైలి గూఢరసమై నారికేళ పాకమున నుండును. కావుననే మల్లినాథసూరి-

'నారికేళ ఫలసమ్మితం వచః భారవేః సపది తద్విభజ్యతే
స్వాదయంతు రసగర్భనిర్భరం సార మస్య రసికాః యథేప్సితం'

'భారవియొక్క వాక్కు నారికేళ ఫలము వంటిది. దాని నిప్పుడు బ్రద్దలు కొట్టెదను. రసగర్భ నిర్భరమైన ఆ వాక్యముయొక్క సారమును రసికులు యథేష్టముగా ఆస్వాదింతురు గాక' యని పలికెను. ప్రౌఢ బంధములైన శ్లోకములను పగులగొట్టినచో లోపల రసనిర్భరమైన యర్థము లభించును. అది చర్వణము చేసినకొలది చవులూరుచుండును. కనుకనే భారవికి కాళిదాసు ప్రక్కన స్థానము లభించినది. కాళిదాసు మార్గముకంటె భిన్నమైన మార్గమును త్రొక్కి, ఆ మార్గమున కాళిదాసునంత వాడనిన ప్రతిష్ఠను భారవి సంపాదించెను. "కవితాశ్రిత కాళిదాస భారవి కీర్తిః' అను వాక్యమున భారవి కవితలో కాళిదాసునంత కీర్తి నార్జించెనని వేయేండ్ల క్రిందటనే వెల్లడింపబడినది గదా.

మాఘుని వంటి మహాకవి నూటికి నూరుపాళ్ళు భారవి యడుగు జాడలలో నడిచెనన్నచో భారవి కవితా గౌరవ మెట్టిదో తెల్లమగును. మాఘుని శిశుపాల వధ మూడు మూర్తుల భారవి కిరాతార్జునీయమును బోలియున్నది. మాఘకవి భారవి మార్గమున నాతనిని మించవలెనన్న స్పర్థతో శిశుపాల వధ రచించెనని పండితుల యభిప్రాయము, కనుకనే యొక యాభాణకము పుట్టినది—

''తావద్భా భారవేర్భాతి యావన్మాఘస్య నోదయః
ఉదితే నైషధే కావ్యే క్వ మాఘః క్వ చ భారవిః''

మాఘ(మాస)ము ఉదయింప నంతవరకే భారవి తేజస్సు ప్రకాశించును. నైషధకావ్యము ఉదయించినంత మాఘు డెక్కడ, మరి భారవి యెక్కడ ?

భారవి గొప్ప పండితుడు. పెక్కు శాస్త్రములందలి యంశములను తన కావ్యమున యథావకాశము చొప్పించెను. వాక్యనిర్మాణమున, పద ప్రయోగమున తన వ్యాకరణ శాస్త్ర పాండిత్యము ప్రదర్శించెను. ఉపమోత్ప్రేక్షలను మిక్కిలి చతురముగా ప్రయోగించెను.

భారవియందు భావన కంటె ఊహ యెక్కువ. ఆయన వర్ణనలందు భూమ్యాకాశములు పట్టనంత ఊహ ప్రస్ఫుటముగా నగపడును. శైలియందువలెనే ఊహలయందును కొంత కృత్రిమత్వము గోచరించును.

'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని' అను నియమము ననుసరించి భారవి తన కావ్యమును 'శ్రియః కురూణాం' అని శ్రీ శబ్దముతో నారంభించుటే కాక ప్రతి సర్గాంత శ్లోకమునందును శ్రీ లక్ష్మి శబ్దములను నిక్షేపించెను. కనుక ఈ కావ్యము లక్ష్మీపద లాంఛితము.

భారవి లోకజ్ఞతను వెల్లడించు అర్థాంతరన్యాసములు, సూక్తులు కావ్యమున పుష్కలముగా గలవు. ఈ గ్రంథము చివర అవి సంగ్రహింప బడియున్నవి.

భారవి వర్ణనా నిపుణుడే కాక వర్ణనా ప్రియుడు. ప్రథమ ద్వితీయ సర్గములలో వస్తువు అతి స్వల్పము. రాజనీతి వర్ణనమే ఈ సర్గములందు ప్రధానము. ప్రథమ సర్గమున వనచరకృతమైన, దుర్యోధన పరిపాలనా వర్ణన పదునారు శ్లోకములు. ద్రౌపదిచేసిన రాజ ధర్మోపన్యాసము పదునెనిమిది శ్లోకములు. ద్వితీయ సర్గమున భీమ సేనుడు, ధర్మరాజు కావించిన నీత్యుపన్యాసములు ఏబదిమూడు శ్లోకము లాక్రమించినవి. చివరి ఆఱు శ్లోకములు వ్యాసవర్ణనము. ప్రథమ ద్వితీయ సర్గములలో రసభావములకంటె ధర్మనీతి ప్రసంగ ములే ప్రాధాన్యము వహించుచున్నవి.

కిరాతార్జునీయమున ప్రధానరసము వీరము—ధర్మవీరము. యుద్ధ వీరము దానికి అనుషంగికము, శృంగారాదు లంగములుగా నిబంధింప బడినవి. భారవి వీరరస పోషణమున ప్రౌఢుడు. ఓజోగుణ బంధుర మైన ఆయన శైలి వీరరసాభివ్యక్తికి సర్వథా యోగ్యమై యున్నది.

—మాధవశర్మ

శ్రీః

మహాకవి భారవి కృతమ్

# కి రా తా ర్జు నీ య మ్

ఆంధ్ర 'బాలసుధా' వ్యాఖ్యా సహితమ్

## ప్ర థ మ స్స ర్గః

---

శ్లో॥ శ్రియః కురూణా మధిపస్య పాలనీం
ప్రజాసు వృత్తిం య మయుంక్త వేదితుమ్
స వర్ణిలింగీ విదితః సమాయయౌ
యుధిష్ఠిరం ద్వైతవనే వనేచరః. 1

పద విభాగము : శ్రియః, కురూణాం, అధిపస్య, పాలనీం, ప్రజాసు, వృత్తిం, యం, అయుంక్త, వేదితుం, సః, వర్ణిలింగీ, విదితః, సమాయయౌ, యుధిష్ఠిరం, ద్వైత వనే, వనేచరః.

అన్వయము : కురూణాం అధిపస్య శ్రియః పాలనీం ప్రజాసు వృత్తిం వేదితుం యం అయుంక్త, వర్ణిలింగీ సః వనేచరః విదితః (సన్) ద్వైతవనే యుధిష్ఠిరం సమాయయౌ.

అర్థము : కురూణాం = కురు దేశములకు; అధిపస్య = అధిపతియగు దుర్యోధనునియొక్క; శ్రియః = రాజ్యలక్ష్మికి; పాలనీం = రక్షకమైన; ప్రజాసు = ప్రజలయందలి; వృత్తిం = వ్యవహారమును; వేదితుం = తెలిసికొనుటకు; యం = ఎవనిని; అయుంక్త = నియోగించెనో; వర్ణి-లింగీ = బ్రహ్మచారి లక్షణములు గల; సః-వనేచరః = ఆ వనచరుడు; విదితః-సన్ = (ఆ వృత్తాంతమును) తెలిసికొన్నవాడై; ద్వైతవనే = ద్వైత వనమునందు (స్థితం = ఉండిన); యుధిష్ఠిరం = ధర్మరాజును; సమాయయౌ = చేరవచ్చెను.

తాత్పర్యము : కురు దేశములకు ప్రభువైన దుర్యోధనుడు రాజ్య సంపదను గాపాడుకొనుటకై ప్రజలయందెట్టి వర్తనము నవలంబించు చుండెనో తెలిసికొనుటకు (ధర్మజుడు) ఎవనిని నియోగించెనో ఆ బ్రహ్మచారి వేషధారియైన వనచరుడు ఆ వృత్తాంతమును దెలిసికొన్నవాడై ద్వైత వనమందున్న ధర్మరాజును చేరవచ్చెను.

వ్యాఖ్యానము : ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాస సంపన్నులైన మహాకవులు లోకోత్తర గుణోత్తరులైన మహాపురుషుల వృత్తాంతములను అభివర్ణించి మహా కావ్యములను నిర్మింతురు. అట్టి మహా కావ్యములు విశ్వశ్రేయములు.

"కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహార విదే శివే తరక్షతయే
సద్యః పర నిర్వృతయే
కాంతా సమ్మితతయోపదేశయుజే"

మహా కావ్యమునకు దృష్టములు, అదృష్టములు నైన ప్రయోజనములు పెక్కు కలవు. బహుళ ప్రయోజనమైన మహా కావ్యము మంగళమయమై యుండవలయును.

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే. వీరపురుషకా ణ్యాయుష్మత్పురుషకాణి చ భవంతి, అధ్యేతారశ్చ ప్రవక్తారో భవంతి" అనిన యనుశాసనము కావ్యములకును వర్తించును. భారవి యను మహా కవి కిరాతార్జునీయము అను మహా కావ్యమును నిర్మింప సంకల్పించి, తన్నిర్విఘ్న పరిసమాప్తి కొఱకు, లోక కళ్యాణము కొఱకు 'శ్రియః' అని మంగళవాచి యైన శ్రీ శబ్దముతో కావ్యారంభము చేయుచున్నాడు.

"దేవతా వాచకాః శబ్దాః యే చ భద్రాదివాచకాః
తే సర్వే నైవ నింద్యాః స్యుర్లిపితో గణతోఽపి వా"

అను న్యాయమున దేవతా వాచకము భద్రతా వాచకమునైన శ్రీ శబ్దము ఆరంభ మందుండుటవల్ల సర్వ దోషములు పరిహృతము లగును.

"ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాఽపి తన్ముఖమ్" అను ఆచార్య దండి యనుశాసనము ననుసరించి కావ్యారంభమున ఆశీర్వచనము, నమస్క్రియ,

వస్తు నిర్దేశము అను వానిలో అన్నియు గాని, కొన్ని గాని ఉండవలయును. ఆశీర్వచన రూపమైన మంగళాచరణము సాధారణముగా నాటకములందు నాందీ శ్లోక రూపమున నుండును. శ్రవ్య కావ్యములందు ఇష్టదేవతా నమస్కారము, వస్తు నిర్దేశము తరచు కావ్యారంభమున గనబడును. కాళిదాసు రఘు వంశమున "వాగార్థా విన" అని నమస్కృతి పలికెను. కుమార సంభవములో "అస్త్యుత్త రస్యాం" అని వస్తు నిర్దేశము గావించెను. ఈ కిరాతార్జునీయమును భారవి ద్వైత వనమందున్న ధర్మజుని వద్దకు వనేచరుడు వచ్చుట యను వస్తునిర్దేశముతో ఆరంభించెను.

కపట ద్యూత పరాభూతులై పాండవులు నియమానుసారము అరణ్యావాసము చేయుచు ద్వైత వనమునందుండిరి. వనవాసకాలము చాలవరకు గడచినది. సమయ పాలనానంతరము తమ రాజ్యము తమకు రావలసి యున్నది కనుక ధర్మరాజు ఎప్పటి కప్పుడు గూఢచారుల ద్వారా కురు రాజ్యమందలి వ్యవహారములను దెలిసికొనుచుండెను. దుర్యోధనుని పాలనమున ప్రజలు సంతుష్టులై యున్నచో తమకు రాజ్య ప్రాప్తి దుష్కరమగును. దుర్యోధనుడును కపటమున సంపాదించిన రాజ్యమును నీతిచే సుస్థిరము గావించుకొన యత్నించు చుండెను. గూఢచారి వచ్చి యీ యంశమే ధర్మజునకు చెప్పనున్నాడు. వ్యాస భారతమున ఈ గూఢచారి వ్యవహారము లేదు. ఇది భారవి కల్పన. దైవమును, ధర్మమును మాత్రమే నమ్ముకొనియున్న ధర్మజుడు రాజనీతిని ఏమరలేదని భారవి సూచన.

'యుధిష్ఠిరః' అను మాట ధర్మజుడు యుద్ధముచేసి యైనను రాజ్యము తిరిగి సంపాదించ గలడని సూచించును. ఆ యుద్ధమునకు నాందీరూపమైన పాశుపతాస్త్ర లాభము ఈ కావ్య వస్తువు. "ద్వే ఇతే గతే యస్మాత్ తత్ ద్వితం; ద్వితమేవ ద్వైతం" అను తీరున దేనినుండి శోకము, మోహము అను రెండును పోయినవో అది ద్వైతము. యుధిష్ఠిరుడు అట్టి వనమందుండి, అట్టి వనమందు చరించు కిరాతుని గూఢచారిగా పంపెను. వనవాసమువల్ల ఆయన చిత్తము శోక మోహాక్రాంతము కాలేదు. ఆయన యెంత ధర్మ నిష్ఠుడో ఆయన దూతయు అంతే ధర్మ నిష్ఠుడు.

"స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియా నిష్పత్తి రేవచ

ఏత న్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః
విపరీతం బ్రహ్మచర్య మేత దే వాష్ట లక్షణమ్"

మిథున సంబంధమైన ఎనిమిది లక్షణముల లేమియే బ్రహ్మచర్యము. గూఢచారియైన వనచరుడు బ్రహ్మచారి కాకున్నను లోకుల యాదరము సంపాదించుటకై బ్రహ్మచారి వేషము ధరించెను. అట్టి వేషము చూచి విశ్వసించి ప్రజలు తమ ప్రభువు పాలనమున తా మనుభవించుచున్న కష్టసుఖములను మనస్సు విప్పి చెప్పుదురు.

'వనే వనేచరః' అను పట్ల స్వర వ్యంజముల యావృత్తి యుండుటచే వృత్త్యనుప్రాసము అను శబ్దాలంకారము గలదు. అవృత్తమైన వర్ణ సముదాయము అర్థభేద యుక్తమైనచో యమకము అయి యుండెడిది.

ఈ సర్గమున 44 వ శ్లోకము వఱకు వంశస్థ వృత్తము.

"జతౌతు వంశస్థ ముదీరితం జరౌ" అను లక్షణమును బట్టి పాదమున జ త జ ర అను గణము లుండుట వంశస్థ లక్షణము.

శ్లో॥ కృత ప్రణామస్య మహీం మహీభుజే
జితాం సపత్నేన నివేదయిష్యతః
న వివ్యథే తస్య మనో న హి ప్రియం
ప్రవక్తు మిచ్ఛంతి మృషా హితైషిణః. 2

పద విభాగము : కృతప్రణామస్య, మహీం, మహీభుజే, జితాం, సపత్నేన, నివేదయిష్యతః, న, వివ్యథే, తస్య, మనః, న, హి, ప్రియం, ప్రవక్తుం, ఇచ్ఛంతి, మృషా, హితైషిణః.

అన్వయము : కృతప్రణామస్య సపత్నేన జితాం మహీం మహీభుజే నివేదయిష్యతః తస్య మనః న వివ్యథే; హితైషిణః మృషా ప్రియం ప్రవక్తుం న ఇచ్ఛంతి హి.

అర్థము : కృత-ప్రణామస్య = చేయబడిన నమస్కారము గలిగిన వాడును; సపత్నేన = దాయాదుడైన దుర్యోధనునిచే; జితాం = వశము చేసికొన బడిన; మహీం = భూమిని (రాజ్యమును) గూర్చి; మహీభుజే = రాజైన ధర్మజునకు; నివేదయిష్యతః = విన్నవింపబోవువాడునునైన; తస్య = ఆ వనచరుని యొక్క; మనః = మనస్సు; న-వివ్యథే = చలింపలేదు; హితైషిణః = స్వామి హితముగోరు వారు; మృషా = అసత్యమైన; ప్రియం = ప్రియమును; ప్రవక్తుం = చెప్పుటకు; న-ఇచ్ఛంతి-హి = ఇచ్ఛగింపరు గదా.

తాత్పర్యము : చేయబడిన ప్రణామము గలవాడును, దాయాదునిచే స్వవశము గావించుకొన బడిన రాజ్యమును గురించి తన ప్రభువునకు నివేదింప బోవు వాడునునైన ఆ వనచరుని యొక్క మనస్సు వ్యథ పొందలేదు. స్వామి హితము గోరువారు మిథ్యా భూతమైన ప్రియమును పలుక నిచ్ఛగింపరుగదా.

అలంకారము : అర్థాంతరన్యాసము.

వ్యాఖ్యానము : ప్రభువులు చారచక్షువులు. చారులు చూచివచ్చి చెప్పిన విషయమును తాము ప్రత్యక్షముగా జూచినట్లే పరమ సత్యమని విశ్వసించి వ్యవహరింతురు. కనుక చార కృత్యమున నియుక్తులగు వారు ప్రభువునకు విశ్వాసపాత్రులు హితైషులునై యుందురు. ప్రియవాదులను సమ్మానించుట, అప్రియవాదులను నిరసించుటయు రాజుల లక్షణము. అందువల్ల అప్రియమైన విషయమును నివేదించుటకు భయపడినచో అట్టి చారుడు ప్రభు హితైషి కాజాలడు. ధర్మజుడు పంపిన చారుడు గ్రహించిన యంశములు ధర్మజునకు ప్రియములు కావు. ఐనను ఆ వనచరుడు ప్రభు హితైషి గనుక ధర్మజునకు యథార్థమే చెప్పదలచెను. ఈ యంశము అర్థాంతరన్యాసముచే సమర్థింప బడినది. హితైషులైనవారు అసత్యమైన ప్రియమును చెప్పరు అను అర్థాంతరముచే రాజ్యము దుర్యోధనునకు వశమై పోయినదను అప్రియమును ధర్మజునకు చెప్పబోవుచున్న చారుని మనస్సు బాధపడలేదు అన్న అంశము సమర్థింప బడినది.

అప్రియమైనను దాచక నివేదించు ఉత్తమ లక్షణముగలవాడు ఆ వనచరుడనియు, అప్రియమైనను హితమైనను సత్యమును వినుట కిష్టపడు ఉత్తమ ప్రభువు ధర్మజుడనియు వ్యంగ్యము.

శ్లో॥ ద్విషాం విఘాతాయ విధాతు మిచ్ఛతో
రహస్యనుజ్ఞా మధిగమ్య భూభృతః
స సౌష్ఠవౌదార్య విశేష శాలినీం
వినిశ్చితార్థా మితి వాచ మాదదే. 3

పద విభాగము : ద్విషాం, విఘాతాయ, విధాతుం, ఇచ్ఛతః, రహసి, అనుజ్ఞాం. అధిగమ్య, భూభృతః, సః, సౌష్ఠవౌదార్య విశేష శాలినీం, వినిశ్చితార్థాం, ఇతి, వాచం, ఆదదే.

అన్వయము : రహసి ద్విషాం విఘాతాయ విధాతుం ఇచ్ఛతః భూభృతః అనుజ్ఞాం అధిగమ్య సః సౌష్ఠవౌదార్య విశేష శాలినీం వినిశ్చితార్థాం ఇతి వాచం ఆదదే.

అర్థము : రహసి = ఏకాంతమున; ద్విషాం = శత్రువులయొక్క; విఘాతాయ = సంహారము కొఱకు; విధాతుం = ప్రయత్నించుటకు; ఇచ్ఛతః = కోరుచున్న; భూభృతః = ధర్మరాజుయొక్క; అనుజ్ఞాం = అనుమతిని; అధిగమ్య = పొంది; సః = ఆ వనచరుడు; సౌష్ఠవ = శబ్ద సాధుత్వము యొక్కయు; ఔదార్య = అర్థగాంభీర్యము యొక్కయు; విశేష = అతిశయముచే; శాలినీం = ప్రకాశించు చున్నదియు; వినిశ్చిత + అర్థాం = విస్పష్టమైన యర్థము గలదియు నగు; ఇతి = ఈ విధమైన; వాచం = వాక్కును; ఆదదే = స్వీకరించెను.

తాత్పర్యము : ఏకాంతమున శత్రుసంహార ప్రయత్నమును గూర్చి యాలోచించు చుండిన ధర్మరాజు ననుమతి పొంది ఆ వనచరుడు శబ్ద సాధుత్వము, అర్థగాంభీర్యము అను విశేషములచే శోభిల్లుచు వినిశ్చితమైన యర్థముగల ఈ క్రింది విధమగు వాక్యమును ఆరంభించెను.

వ్యాఖ్యానము : వ్యాస భారతమున ధర్మరాజు అజాత శత్రువు. దుర్యోధనాదులను గూడ ఆయన శత్రువులనుగా పరిగణించలేదు. అరణ్య-అజ్ఞాతవాసములను పూర్తిచేసి సమయ పాలనానంతరము తన రాజ్య భాగమును తాను పొందగలనన్న యభిప్రాయము గలవాడు. ఈ కావ్యమున ధర్మజుడు శత్రునాశనమునకు ఉపాయము లాలోచించుచున్నట్లు చెప్పబడినది. కనుకనే ఆయన చారులను

నియమించెను. వార్తలు తెలిసికొనుచుండెను. "ద్విషాం విఘాతాయ విధాత మిచ్ఛతః" అనుట వ్యాస భారతమున నిగూఢముగా నున్న ధర్మజుని యభిప్రాయమును బట్టబయలు చేయుట. ఆయన శత్రుసంహారమును గూర్చి ఒంటరిగా ఆలోచించు చుండెనట. ఇట్లనుటచే ధర్మజుని ప్రసిద్ధమైన శీలము ఎంతో మారిపోయినది. ఆయన యజాత శత్రుత్వము, అహింసా వ్రతము మరుగై పోయినవి.

"భారవే రర్థ గౌరవం" అను ప్రసిద్ధికి దగినట్లు భారవి యిచ్చట ఉత్తమ వాక్య లక్షణములు సూచించుచున్నాడు. శబ్దము నుష్ఠుగా-అర్థ సమర్పణ సమర్థముగా ఉండవలెను. ఔదార్యమనగా అర్థ గౌరవము. వాక్యమున అర్థము నిండుగా ఉండవలెను. ఆ యర్థము వినిశ్చితమై యుండవలెను. అనగా వాక్యమున నిరర్థకములు, అనర్థకములు, సందిగ్ధార్థములు, నేయార్థములునైన పదములు ఉండరాదు. సమర్థములైన శబ్దములచే నిండైన యర్థమును స్పష్టముగా ప్రతిపాదించునది ఉత్తమ వాక్యము.

శ్లో॥ క్రియాసు యుక్తై ర్నృప చారచక్షుషో
న వంచనీయాః ప్రభవో ఽ నుజీవిభిః
అతోఽర్హసి క్షంతు మసాధు సాధు వా
హితం మనోహారి చ దుర్లభం వచః. 4

పద విభాగము : క్రియాసు, యుక్తైః, నృప, చార చక్షుషః, న, వంచనీయాః, ప్రభవః, అనుజీవిభిః, అతః, అర్హసి, క్షంతుం, అసాధు, సాధు, వా, హితం, మనోహారి, చ, దుర్లభం, వచః

అన్వయము ; హే నృప ! క్రియాసు యుక్తైః అనుజీవిభిః చారచక్షుషః ప్రభవః న వంచనీయాః; అతః అసాధు సాధు వా (మదుక్తం) క్షంతుం అర్హసి; హితం మనోహారి చ వచః దుర్లభం.

అర్థము : హే నృప = ఓ రాజా !; క్రియాసు = కార్యములందు; యుక్తైః = నియోగింపబడిన; అనుజీవిభిః = భృత్యులచేత; చార-చక్షుషః = గూఢచారులే నేత్రములుగా గల; ప్రభవః = ప్రభువులు; న-వంచనీయాః =

వంచింపదగినవారు కాదు; అతః = అందువలన; అసాధు = అప్రియమైనదియైనను; సాధు-వా = ప్రియమైనదైనను; (మదుక్తం = నాచే జెప్పబడిన దానిని); క్షంతుం = క్షమించుటకు; అర్హాసి = తగుదువు; హితం = హితకరమైనది; మనోహారి-చ = మనోహరమైనదియునైన; వచః = వాక్యము; దుర్లభం = దుర్లభమైనది.

తాత్పర్యము : ఓ రాజా ! రాజకార్యములందు నియుక్తులైన భృత్యులచే చారులే కన్నులుగా గల ప్రభువులు వంచనీయులు కారు. అందువల్ల అప్రియమైనను, ప్రియమైనను (నేను చెప్పబోవుదానిని) క్షమింప దగుదువు. హితకరము, మనోహరమునైన వాక్యము దుర్లభము గదా.

అలంకారము : అర్థాంతరన్యాసము.

వ్యాఖ్యానము : తామే కన్నులని తమపై విశ్వాసముంచియున్న రాజులను రాజ కార్యములందు నియుక్తులైన చారులు వంచింపరాదు. అది రాజద్రోహమగును. కంటికి చెడు కనబడినదని కంటిపై కోపింపము గదా. అట్లే చారుడు తనకు గనబడిన చెడును తెల్పినప్పుడు రాజులు వారిపై కోపింపరాదు.

"గావః పశ్యంతి గంధేన వేదైః పశ్యంతి పండితాః
చారైః పశ్యంతి రాజానః చక్షుర్భ్యా మితరే జనాః"

అను న్యాయమున ఇతర జనులు తమ కన్నులతో చూచినట్లు రాజులు చారులచేత చూతురు. "స్వపర మండలకార్యావలోకనే చారా శ్చక్షూంషి క్షితిపాలకానాం" అనుటచే రాజులు చారులపై ఆధారపడక తప్పదు. వారు ప్రియము చెప్పినను అప్రియము చెప్పినను వినక తప్పదు. వారు చెప్పవలసినది హితముగా నుండుట ముఖ్యము. ప్రియముగా నుండుట ఆనుషంగికము. ధర్మజుడు పంపిన వనచరుడు ప్రభు హితైషియైన చారుడు గనుక తాను చెప్పబోవు హితము ప్రియమైనను కాకున్నను క్షమింప వలయు నని వాడు ధర్మజుని ప్రార్థించి తన ప్రార్థనను అర్థాంతరన్యాసముచే సమర్థించు చున్నాడు. హితము ప్రియమునైన వాక్యము దుర్లభము అను కారణముచే అప్రియమైనను హితమైన నా వాక్యమును క్షమింప వలయును అను కార్యము సమర్థింపబడినది.

"అసాధు సాధు వా" అనగా అసాధువు గాని సాధువుగాని అని సామాన్యార్థము. 'వా' శబ్దమునకు ఇవ యను నర్థము కలదు. ఆ యర్థము గ్రహించినచో 'అసాధు సాధు ఇవ' – అసాధువును సాధువును వలె క్షమింపుము అను విశేషార్థము వచ్చును. అప్రియమైనను హితమైనది గనుక ప్రియమైన దానిని వలెనే గ్రహింపుము అని భావము.

"సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః"

అని రామాయణమున మారీచుడు రావణునితో పలికిన వాక్యము ఇచ్చట స్మరింప దగినది.

శ్లో॥ స కింసఖా సాధు న శాస్తి యోఽధిపం
హితాన్న యస్సంశృణుతే స కింప్రభుః
సదానుకూలేషు హి కుర్వతే రతిం
నృపే ష్వమాత్యేషు చ సర్వ సంపదః. 5

పద విభాగము : సః, కింసఖా, సాధు, న, శాస్తి, యః, అధిపం, హితాన్, న, యః, సంశృణుతే, సః, కింప్రభుః, సదా, అనుకూలేషు, హి, కుర్వతే, రతిం, నృపేషు, అమాత్యేషు, చ, సర్వసంపదః.

అన్వయము : యః అధిపం సాధు న శాస్తి సః కింసఖా; యః హితాన్ న సంశృణుతే సః కింప్రభుః; నృపేషు అమాత్యేషు చ సదా అనుకూలేషు (సత్సు) సర్వ సంపదః రతిం కుర్వతే హి.

అర్థము : యః = ఏ సఖుడు; అధిపం = ప్రభువు నుద్దేశించి; సాధు = హితమును; న–శాస్తి = ఉపదేశింపడో; సః = ఆ సఖుడు; కింసఖా = కుత్సిత సఖుడు; యః = ఏ ప్రభువు; హితాన్ = హితోపదేశములను; న–సంశృణుతే = చక్కగా ఆలకింపడో; సః = ఆ ప్రభువు; కింప్రభుః = కుత్సిత ప్రభువు; నృపేషు = రాజులును; అమాత్యేషు–చ = అమాత్యులును; సదా = ఎల్లప్పుడు; అనుకూలేషు (సత్సు) = అనుకూలురై యున్నప్పుడు; సర్వ–సంపదః = సకల సంపదలును; రతిం = ప్రీతిని; కుర్వతే–హి = చేయును గదా.

తాత్పర్యము : ఏ సఖుడు ప్రభువు నుద్దేశించి హితవాక్యము నుపదేశింపడో ఆ సఖుడు కుత్సిత సఖుడు. ఏ ప్రభువు హితోపదేశములను చక్కగా ఆలకింపడో ఆ ప్రభువు కుత్సిత ప్రభువు. మంత్రులును రాజులును సదా పరస్పరానురాగ యుక్తులై యున్నప్పుడు సర్వ సంపదలు వారిపట్ల ప్రీతి పొందును గదా.

అలంకారము : అర్థాంతరన్యాసము.

వ్యాఖ్యానము : తాను చెప్పబోవు విషయములు ధర్మజునకు అప్రియముగా నుండునని చారు డెఱుంగును. కనుక అప్రియములైన హితములను వినుటకు యోగ్యమైన చిత్తవృత్తిని ధర్మజుని యందు ఉత్పాదించుటకై చారుడు ప్రకృతోపయోగులైన యప్రస్తుత వచనములు పలుకుచున్నాడు.

రాజునకు హితమే చెప్పుట మంత్రి ధర్మము. మంత్రి చెప్పిన హితము ననుష్ఠించుట రాజు ధర్మము. ఇట్లు రాజు మంత్రి హితమునందే బద్ధ చిత్తులై యున్నచో సర్వ సంపదలు తమంత సిద్ధించును. పరస్పరానుకూలురు కాని రాజ మంత్రులు ఉత్తమ రాజమంత్రులు కారు అనుట అప్రస్తుత ప్రశంస. వారు పరస్పరానుకూలురు ఐ యుండవలెను అను ప్రస్తుతాంశద్యోతనార్థము చెప్ప బడినది. రాజు, మంత్రి పరస్పరానుకూలురగుటచే సంపత్సిద్ధి యగునని యర్థాంతరన్యాసము. సంపత్సిద్ధియను కార్య కథనముచే అనుకూల్యమను కారణము సమర్థింపబడినది.

శ్లో॥ నిసర్గ దుర్బోధ మబోధ విక్లబాః
క్వ భూపతీనాం చరితం క్వ జంతవః
తవానుభావోఽయ మవేది యన్మయా
నిగూఢతత్త్వం నయవర్త్మ విద్విషామ్. 6

పద విభాగము : నిసర్గ దుర్బోధం, అబోధ విక్లబాః, క్వ, భూపతీనాం, చరితం, క్వ, జంతవః, తవ, అనుభావః, అయం, అవేది, యత్, మయా, నిగూఢతత్త్వం, నయవర్త్మ, విద్విషాం.

అన్వయము : నిసర్గ దుర్బోధం భూపతీనాం చరితం క్వ ? అబోధ విక్లబాః జంతవః క్వ ? మయా విద్విషాం నిగూఢతత్వం నయవర్త్మ అవేది (ఇతి) యత్ అయం తవ అనుభావః.

అర్థము : నిసర్గ = స్వభావముచేత; దుర్బోధం = తెలిసికొనశక్యము గాని; భూపతీనాం = రాజులయొక్క; చరితం = ప్రవర్తన; క్వ = ఎక్కడ; అబోధ = అజ్ఞానముచే; విక్లబాః = దుర్బలులైన; జంతవః = పామర జనులు; క్వ = ఎక్కడ; మయా = నా చేత; విద్విషాం = శత్రువులయొక్క; నిగూఢ = దాచబడిన; తత్వం = యథార్థ స్వరూపముగల; నయ-వర్త్మ = నీతిమార్గము; అవేది = తెలిసికొనబడినది; (ఇతి) యత్ = అనునది యేది కలదో; అయం = ఈ తెలిసికొనుట; తవ = నీయొక్క; అనుభావః = సామర్థ్యమే.

తాత్పర్యము : స్వభావముచే గ్రహింప శక్యముగాని రాజుల ప్రవర్తన యెక్కడ ? అజ్ఞానోపహతులగు పామర జనులెక్కడ ? శత్రువుల యొక్క గుప్తమైన రహస్యముగల నీతి మార్గము నావంటి వానిచే దెలిసికొనబడిన యెడలచో అది నీ సామర్థ్యమే.

అలంకారము : విషమము.

వ్యాఖ్యానము : శత్రువుల రహస్యములను భేదించు తలంపుతో ధర్మరాజు వనచరులకు రాజనీతి తత్వమంతయు క్షుణ్ణముగా బోధించి ఆరితేరిన కుశాగ్ర బుద్ధులను గూఢచారులుగా నుపయోగించు చుండెను. కానిచో అనాగరకుడైన వనచరుడు అతి గహనమైన కుటిల రాజనీతి రహస్యములను గ్రహించుట అసంభవము. కనుకనే వనచరుడు తాను శత్రువుల నీతి మార్గమందలి నిగూఢ తత్వమును గ్రహించుటకు కారణము ధర్మజుని సామర్ధ్యమే యనుచున్నాడు. త్రేతాయుగమున శ్రీరామచంద్రుడు వలె ద్వాపరమున ధర్మజుడును వనచర సాచివ్యమును స్వీకరించెనని భావము. వనచరులను 'జంతవః' అనుటవల్ల వారు మృగప్రాయ్యలని వ్యంగ్యము. రాజనీతి తత్వమెక్కడ ? మావంటి పామరులెక్కడ ? విషమములైన యర్థములు ఏకత్ర సంఘటితము లగుటచే నిది విషమాలంకారము. రాజనీతికి వనచరులకు ఎంతో దూరము. ధర్మజుని మహిమవల్ల ఆ దూరము పూర్తిగా లోపించినదని వనచరుని యభిప్రాయము. ఈవాక్యము వనచరుని వినయ సంపదను, నిరహంకారత్వమును చాటుచున్నది.

"సంధి విగ్రహ యానాని సంసా ప్యాసన మేవ చ
ద్వైధీ భావశ్చ విజ్ఞేయాః షడ్గుణాః నీతి వేదినాం"

ఇది రాజనీతి మార్గము. వీని తత్త్వము చక్కగా దెలిసినవాడు గనుక దుర్యోధనుడు వీని నెట్లవలంబించుచుండెనో వనచరుడు బాగుగా గ్రహింప గలిగెను.

శ్లో॥ విశంకమానో భవతః పరాభవం
నృపాసన స్థోఽపి వనాధివాసినః
దురోదరచ్ఛద్మజితాం సమీహతే
నయేన జేతుం జగతీం సుయోధనః. 7

పద విభాగము : విశంకమానః. భవతః, పరాభవం, నృపాసనస్థః, అపి, వనాధివాసినః, దురోదరచ్ఛద్మజితాం, సమీహతే, నయేన, జేతుం, జగతీం, సుయోధనః.

అన్వయము : సుయోధనః నృపాసనస్థః అపి వనాధివాసినః భవతః పరాభవం విశంకమానః (సన్) దురోదరచ్ఛద్మజితాం జగతీం నయేన జేతుం సమీహతే.

అర్థము : సుయోధనః = దుర్యోధనుడు; నృప + ఆసనస్థః — అపి = రాజ సింహాసనమునందున్న వాడయ్యు; వన + అధివాసినః = అరణ్యమందు నివసించుచున్న; భవతః = నీవలన; పరాభవం = పరాజయమును; విశంకమానః (సన్) = విశేషముగా శంకించుచున్న వాడై; దురోదర = జూదమనెడి; ఛద్మ = మిషచేత; జితాం = జయింపబడిన; జగతీం = భూమిని; నయేన = నీతిచేత; జేతుం = స్వాధీనమొనర్చుకొనుటకు; సమీహతే = యత్నించుచున్నాడు.

తాత్పర్యము : దుర్యోధనుడు సింహాసనము నందున్న వాడయ్యు వనవాసము చేయుచున్న నీవలన పరాజయమును మిక్కిలిగా శంకించు చున్నవాడై జూదమనెడు మిషచే జయింపబడిన భూమిని నీతిచేత వశపఱచుకొన యత్నించుచున్నాడు.

అలంకారము : కావ్యలింగము.

వ్యాఖ్యానము : సింహాసనస్థుడైన దుర్యోధనుడు వనస్థుడైన ధర్మజుని లన పరాజయము శంకించుటకు గారణము ఆయన ధర్మనిష్ఠ, ఆయన తమ్ముల రాక్రమము. దుర్యోధనుడు యుద్ధము చేసి పాండవులను గెలువజాలడు. కనుకనే పట ద్యూతమున వారి రాజ్య మపహరించెను. అపహరించిన దానిని నిలబెట్టు ాధనముగా ప్రజారంజకమగు రాజనీతిని అవలంబించు చుండెను. దుర్యోధనుడు ాండవ ద్వేషియే కాని ప్రజాద్వేషికాదు. పాండవులయం దనురక్తులై యున్న ప్రజలను తనయం దనురక్తులను గావించుకొనుటకై యాతడు ప్రత్యేక శ్రద్ధతో త్పరిపాలనము జరుపుచుండెను. పాండవుల జనరంజకత స్వతస్సిద్ధము. నిర్వ్యా ము. దుర్యోధనుని జనరంజకత కృత్రిమము, ప్రయోజన సాపేక్షము.

బలవంతుని సంపదను అపమార్గమున చేజిక్కించుకొని యనుభవించు వానికి చిత్తశాంతి యుండదు. కనుక దుర్యోధనుడు ఉదాసీనుడై యుండక పాండవుల వల్ల పరాజయము శంకించుచు తత్ప్రతీకారార్థము ప్రజారంజకమైన పాలనా విధానము నవలంబించెను. ప్రజలు దుర్యోధనుని పట్ల అనురక్తులగుచున్నారన్న మాట ధర్మజునకు అప్రియమైనదేకాని సత్యము గనుక వనచరుడు చెప్పుచున్నాడు.

కపట ద్యూతమున జయించబడినదన్న కారణమున భూమిని నీతిచేత వశపరచుకొన జూచుచున్నాడు అనుపట్ల నీతిచే వశపరచుకొన గోరుటకు కపట ద్యూతజితత్వము హేతువుగా జెప్పబడినది గనుక ఇది కావ్యలింగాలంకారము. "హేతోర్వాక్య పదార్థత్వే కావ్యలింగ ముదాహృతం" అని లక్షణము.

శ్లో॥ తథాపి జిహ్మ స్స భవజ్జిగీషయా
తనోతి శుభ్రం గుణ సంపదా యశః
సమున్నయన్ భూతి మనార్య సంగమా
ద్వరం విరోధోఽపి సమం మహాత్మభిః 8

పద విభాగము : తథాపి, జిహ్మః, సః, భవజ్జిగీషయా, తనోతి, శుభ్రం, గుణసంపదా; యశః, సమున్నయన్, భూతిం, అనార్య సంగమాత్, వరం, విరోధః, అపి, సమం, మహాత్మభిః.

అన్వయము : తథాపి జిహ్మః సః భవజ్జిగీషయా గుణసంపదా శుభ్రం యశః తనోతి; భూతిం సమున్నయన్ మహాత్మభిః సమం విరోధః అపి అనార్య సంగమాత్ వరం.

అర్థము : తథాపి = అయినప్పటికిని; జిహ్మః = కుటిలుడైన; సః = ఆ దుర్యోధనుడు; భవత్ = నిన్ను; జిగీషయా = జయించు కోర్కెచేత; గుణ-సంపదా = దాక్షిణ్యాది గుణముల సంపదచే; శుభ్రం = నిర్మలమైన; యశః = కీర్తిని; తనోతి = వ్యాపింపజేయు చున్నాడు; భూతిం = ఐశ్వర్యమును; సమున్నయన్ = వృద్ధిచేయునట్టి; మహాత్మభిః + సమం = మహా పురుషులతోడి; విరోధః-అపి = వైరముకూడ; అనార్య-సంగమాత్ = దుర్జన సాంగత్యముకంటె; వరం = మేలయినది.

తాత్పర్యము : అయినప్పటికిని కుటిలుడైన యా దుర్యోధనుడు నిన్ను జయించవలె నన్న కోరికతో దాక్షిణ్యాది గుణ సంపదచే నిర్మలమైన కీర్తిని పెంపొందించుకొను చున్నాడు. ఐశ్వర్యమును వృద్ధిచేయునదై మహాత్ములతోడి వైరము కూడ దుర్జనులతోడి సాంగత్యము కంటె మేలే యగుచున్నది.

అలంకారము : అర్థాంతరన్యాసము; కావ్యలింగము.

వ్యాఖ్యానము : దుర్యోధనుడు స్వభావముచే కుటిలుడు. దాన దయాది గుణములను ఆతడు ప్రకటించుట కూడ వాని కుటిల నీతిలో ఒక భాగమే. ధర్మజుని వలన ఒక వంక పరాజయము శంకించుచు వేరొక వంక అతనిని పరాభవించుటకు కృత్రిమ సౌజన్యమును ప్రయత్న పూర్వకముగా ప్రదర్శించి కీర్తి నార్జించుచున్నాడు. మహాగుణశాలియైన ధర్మజుని సంపదను కపట ద్యూతమున హరించి, దానిని వశము చేసికొనుటకై ధర్మజునికంటె గుణశాలి యని పించుకొనవలెనని యత్నించుచున్నాడు. ఈ విధముగా ధర్మజుని వంటి మహాత్ముని తోడి విరోధమువల్ల దుర్యోధనుడు కృత్రిమముగ నైనను సుగుణ సంపదను అవలంబించుచున్నాడు.

దుర్యోధనునకు అనార్యులైన మిత్రులు పలువురున్నారు. ఆ మైత్రివల్ల అతనికి దుర్గుణములే యలవడినవి. కీర్తి కలుగలేదు. మహాత్ముడైన ధర్మజుని తోడి వైరము వానికి సుగుణ సంపదను, కీర్తిని పెంపొందించినది. ధర్మజుని

జయింపవలెనని దుర్యోధనుడు సుగుణ సంపదచే కీర్తిని పెంపొందించుకొనెను అన్న విశేష విషయము మహాత్ములతో వైరము మేలయినది గదా యన్న సామాన్య విషయముచే సమర్థింప బడినది గనుక అర్థాంతరన్యాసము. ఐశ్వర్యమును వృద్ధిచేయుట మహాత్ములతోడి వైరము యొక్క శ్రేయస్కరత్వమునకు గారణముగా జెప్పబడినది గనుక కావ్య లింగము. ఈ కావ్య లింగము అర్థాంతర న్యాసమునకు బలము గలిగించుచున్నది.

'వరం' అనగా కొంచెము మేలయినది. శత్రుత్వ మెప్పుడును మేలుకాదు. కాని దుర్జనులతోడి మైత్రితో పోల్చినప్పుడు సజ్జనులతోడి శత్రుత్వము కొంత మేలే యగును.

శ్లో॥ కృతారిషడ్వర్గ జయేన మానవీ
మగమ్య రూపాం పదవీం ప్రపిత్సునా
విభజ్య నక్తం దివ మస్తతంద్రిణా
వితన్యతే తేన నయేన పౌరుషమ్. 9

పద విభాగము : కృతారిషడ్వర్గజయేన, మానవీం, అగమ్య రూపాం, పదవీం, ప్రపిత్సునా, విభజ్య, నక్తం దివం, అస్తతంద్రిణా, వితన్యతే, తేన, నయేన, పౌరుషం.

అన్వయము : కృతారి షడ్వర్గ జయేన అగమ్య రూపాం మానవీం పదవీం ప్రపిత్సునా అస్త తంద్రిణా తేన నక్తందివం విభజ్య నయేన పౌరుషం వితన్యతే.

అర్థము : కృత = చేయబడిన; అరిషడ్వర్గ = అంతశ్శత్రువు లారింటి యొక్క; జయేన = విజయము గలవాడును; అగమ్య-రూపాం = గ్రహింప శక్యముగాని రూపముగల; మానవీం = మనువుచే జెప్పబడిన; పదవీం = పాలనా పద్ధతిని; ప్రపిత్సుః = పొంద గోరినవాడును; అస్త తంద్రిణా = పోయిన యలసత గలవాడును నైన; తేన = ఆ దుర్యోధనుని చేత; నక్తం దివం = రేయింబవళ్లు; విభజ్య = విభజింపబడి; నయేన = నీతిచే; పౌరుషం = పురుషకారము; వితన్యతే = విస్తరింప బడుచున్నది.

తాత్పర్యము : కామక్రోధాదులైన యంతశ్శత్రువు లారింటిని జయించిన వాడును, ఎవరికిని గ్రహింప శక్యముగాని రూపముగల మను విహితమైన పాలనా పద్ధతిని బొందగోరిన వాడును, అలసతను పరిత్యజించిన వాడును నైన ఆ దుర్యోధనుని చేత రాత్రింబవళ్లు విభజింప బడి నీతిచే పురుషకారము విస్తరింప బడు చున్నది.

వ్యాఖ్యానము : రాజులు అరిషడ్వర్గమును జయించి ఇంద్రియ నిగ్రహము కలవారై యుండ వలయును. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను ఆరును మనుష్యుని వినాశమునకు కారణము లగును గనుక ఇవి మానవునకు అంతశ్శత్రువులు. రాజులు అంతః శత్రువులను జయించిన వారై ప్రవర్తించుట ప్రజా పరిపాలన విషయమున మాత్రమే. శత్రు రాజుల విషయమున రాజుల కీ కామక్రోధాదులు ఉండ వలసినవే. దుర్యోధనుడు అంతః శత్రువులను జయించి ప్రవర్తించుట స్వరాజ్యపాలన విషయమందే. పాండవుల పట్ల వానికి ఈ గుణము లన్నియు కలవు. ధర్మజునకు ఇవి యెవరిపట్లను లేవు. కనుక ఆయన అరిషడ్వర్గ విజయము యథార్థమైనది. దుర్యోధనునిది కృత్రిమము. ప్రయోజనాపేక్షతో ప్రదర్శింప బడుచున్నది.

రాజులకు మనువు నిర్దేశించిన ప్రజా పరిపాలనా మార్గము ఆదర్శము. దాని నిజ తత్వము అందరికి గ్రాహ్యము కాదు. అగమ్యమైన ఆ తత్వమును సాధింపవలెనని దుర్యోధనుని యత్నము. కనుక ఆతడు రాత్రిం బవళ్లు ఏకాలమున నే రాజ ధర్మము ననుష్ఠింప వలెనో ఆ కాలమున దాని ననుష్ఠించుచు రాజ నీతి నవలంబించి పురుష ప్రయత్నము చేయుచున్నాడు. కాని దైవ బలము యొక్క తోడ్పాటు లేనిదే నీతి బలము, పురుషకార బలము ఫలవంతములు కాజాలవు.

రక్షాభయ దానములు, ఆయవ్యయోప దర్శనము, పౌర జానపదుల కార్యావేక్షణము, స్నాన భోజనాదుల యుపసేవనము, ఉద్యానగమన జలక్రీడాదికము, కరి తురగ రథాది పర్యవేక్షణము, సేనా సంఖ్యాదుల వృద్ధి క్షయ చింతనము మున్నగు కార్యములు చేయుటకు రాజులకు నియతములైన సమయము లుండును. ఆ కార్యములను ఆ సమయములందే చేయవలయును.

శ్లో॥ సఖీనివ ప్రీతి యుజోఽను జీవినః
సమాన మానాన్ సుహృదశ్చ బంధుభిః
స సంతతం దర్శయతే గతస్మయః
కృతాధిపత్యా మివ సాధు బంధుతామ్. 10

పద విభాగము : సఖీన్, ఇవ, ప్రీతియుజః, అనుజీవినః, సమానమానాన్, సుహృదః, చ, బంధుభిః, సః, సంతతం, దర్శయతే, గతస్మయః, కృతాధిపత్యాం, ఇవ, సాధు, బంధుతాం.

అన్వయము : గతస్మయః సః అనుజీవినః ప్రీతియుజః సఖీన్ ఇవ, సుహృదః బంధుభిః సమానమానాన్, బంధుతాం కృతాధిపత్యాం ఇవ చ సాధు సంతతం దర్శయతే.

అర్థము : గత స్మయః = పోయిన గర్వము గలవాడైన; సః = ఆ దుర్యోధనుడు; అనుజీవినః = భృత్యులను; ప్రీతియుజః = ప్రేమతో గూడిన; సఖీన్ + ఇవ = మిత్రులను వలెను; సుహృదః = మిత్రులను; బంధుభిః = బంధువులతో; సమాన-మానాన్ = సమానమైన గౌరవముగల వారినిగాను; బంధుతాం = బంధువుల సమూహమును; కృతాధిపత్యాం + ఇవ-చ = చేయబడిన యాధిపత్యముగల దానిని వలెను; సాధు = నిష్కపటముగా; సంతతం = ఎల్లప్పుడు; దర్శయతే = చూపుచున్నాడు.

తాత్పర్యము : అహంకారము లేనివాడై ఆ దుర్యోధనుడు భృత్యులను ప్రేమయుక్తు లయిన మిత్రులవలెను, మిత్రులను బంధువులతో సమానమైన గౌరవముగల వారినిగాను, బంధువులను రాజ్యాధికారము గలవారిని వలెను నిష్కపటముగ ఎల్లప్పుడు ప్రదర్శించు చున్నాడు.

వ్యాఖ్యానము : రాజ్యమంతయు దుర్యోధనునకు చేజిక్కినను అది వానికి పూర్తిగా వశము కాలేదు. ప్రజల కింకను పాండవులపట్ల అనురాగము తగ్గలేదు. కనుకనే చక్రవర్తి పదవి లభించినను తాను చక్రవర్తినన్న గర్వమును దుర్యోధనుడు ప్రకటించుట లేదు. ఈ సామ్రాజ్యము మాదే యని సేవకులు, మిత్రులు, బంధువులు తలంచునట్లు దుర్యోధనుడు ప్రవర్తించుచుండెను. సేవకులను

పుత్రులవలె, మిత్రులను బంధువుల వలె, బంధుపులను ప్రభువులవలె దుర్యోధనుడు మన్నించుట అతని కుటిల నీతిలో భాగమే. "దర్శయతే" అనుటవల్ల ఆతడట్లు మన్నింపకున్నను లోకమునకు ఆ విధముగా ప్రదర్శించుచుండెను అని భావము.

శ్లో॥ అసక్త మారాధయతో యథాయథం
విభజ్య భక్త్యా సమపక్షపాతయా
గుణానురాగా దివ సఖ్యమీయివా
న్న బాధతేఽస్య త్రిగణః పరస్పరమ్. ॥

పద విభాగము: అసక్తం, ఆరాధయతః, యథాయథం, విభజ్య, భక్త్యా, సమ పక్షపాతయా, గుణానురాగాత్, ఇవ, సఖ్యం, ఈయివాన్, న, బాధతే, అస్య, త్రిగణః, పరస్పరం.

అన్వయము: యథాయథం విభజ్య సమపక్షపాతయా భక్త్యా అసక్తం ఆరాధయతః అస్య త్రిగణః గుణానురాగాత్ సఖ్యం ఈయివాన్ ఇవ పరస్పరం న బాధతే.

అర్థము: యథాయథం = తగురీతిగా; విభజ్య = విభజించి; సమ-పక్ష పాతయా = సమానమైన యభిమానముగల; భక్త్యా = అనురాగముతో; అసక్తం = తగులుపాటు లేనట్లుగా; ఆరాధయతః = సేవించుచున్న; అస్య = దుర్యోధనుని యొక్క; త్రిగణః = త్రివర్గము; గుణ + అనురాగాత్ = గుణములందలి ప్రేమ వలన; సఖ్యం = స్నేహమును; ఈయివాన్ + ఇవ = పొందినదా యన్నట్లు; పరస్పరం = ఒకదాని నొకటి; న-బాధతే = బాధించుట లేదు.

తాత్పర్యము: ఉచితమైన విధమున విభజించి సమానమైన పక్షపాతము గల భక్తితో ఆసక్తిలేని తీరున ఆరాధించుచున్న ఆ దుర్యోధనుని యొక్క ధర్మార్థ కామము లనెడు పురుషార్థ త్రయము వాని గుణములందలి యనురాగమువల్ల వానియందు స్నేహము పొందినదా యన్నట్లు ఒకదాని నొకటి బాధించకుండెను.

అలంకారము: ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : ధర్మము, అర్థము, కామము అను మూడు పురుషార్థములు ివర్గము. మోక్షముతో కలిపి చతుర్వర్గము. దుర్యోధనునకు మోక్షదృష్టి లేదు. నుక ఆతడు త్రివర్గమునే ఆరాధించుచుండెను. మూడింటి యందును సమాన ైన యభిమానమే ప్రదర్శించుచుండెను. దేనియందును ఆసక్తి లేనట్లు కనబడు ండెను. "అసక్తం" అనగా అసక్తుని వలె అనియే అర్థము వానికి అర్థము ందత్యంతాసక్తి. కపటమున హరించిన రాజ్యమును సుస్థిరము చేసికొనుటకే కదా ా యత్నమంతయు. "జిహ్మః" అన్న మాట వాని ప్రవర్తన రహస్యమును యట బెట్టునది. వాని కృత్రిమ గుణములందు అనురాగము పొందినవా యన్నట్లు ర్మార్థ కామములను మూడు పురుషార్థములు పరస్పర వైరము లేకయుండెనట. ముగా గుణానురాగమువల్ల కాకున్నను గుణానురాగము వల్లనే యని భావింప కుటచే ఇది ఉత్ప్రేక్ష. త్రివర్గమునకు వైరము లేకుండునట్లు దుర్యోధనుడు జనీతి ననుసరించి పురుష ప్రయత్నము చేయుచుండెనే తప్ప త్రివర్గమునకు ని గుణములందు నిజముగా అనురాగము లేదు. త్రివర్గముల యారాధనమున ర్యోధనునకు నిజముగా ఆసక్తి లేదు. వాని యాసక్తి యంతయు అపహరించిన జ్యమును వశపరచుకొనుట యందే. కనుక వాడు అసక్తుని వలె కనబడు ండెను.

"ధర్మార్థ కామాః సమమేవ సేవ్యాః
యో హ్యేక సక్తః స నృపో జఘన్యః"

ఆ రాజనీతిని దుర్యోధనుడు రాజ ధర్మముగా కాక ప్రయోజనాపేక్షతో అనుస చుచుండెను.

శ్లో॥ నిరత్యయం సామ న దానవర్జితం
న భూరిదానం విరహయ్య సత్క్రియామ్
ప్రవర్తతే తస్య విశేష శాలినీ
గుణానురోధేన వినా న సత్క్రియా. 12

పద విభాగము : నిరత్యయం, సామ, న, దానవర్జితం, న, భూరి, దానం హయ్య, సత్క్రియాం, ప్రవర్తతే, తస్య, విశేష శాలినీ, గుణానురోధేన, ా, న, సత్క్రియా.

అన్వయము: తస్య నిరత్యయం సామ దాన వర్జితం న ప్రవర్తతే; (తస్య) భూరి దానం సత్క్రియాం విరహయ్య న (ప్రవర్తతే); విశేష శాలినీ (తస్య) సత్క్రియా గుణానురోధేన వినా న (ప్రవర్తతే).

అర్థము : తస్య = ఆ దుర్యోధనుని యొక్క; నిరత్యయం = బాధ లేని ; సామ = సామోపాయము : దాన-వర్జితం = దానరహితమై ; న-ప్రవర్తతే = ప్రవర్తిలేదు; భూరి-దానం = అతని గొప్పదానము ; సత్క్రియాం = సత్కారమును ; విరహయ్య = విడిచి ; న (ప్రవర్తతే) = ప్రవర్తించుటలేదు ; విశేష-శాలినీ = అతిశయముగా ప్రకాశించునట్టి ; సత్క్రియా = సత్కారము ; గుణ + అనురోధేన-వినా = గుణముల యనుసరణములేక; న (ప్రవర్తతే) = ప్రవర్తించుటలేదు.

తాత్పర్యము: ఆ దుర్యోధనునియొక్క నిర్బాధమైన సామము దానమును విడిచియుండుటలేదు. వాని గొప్పదైన దానము సత్కారమును విడిచియుండుట లేదు. విశేషముగా ప్రకాశించు వాని సత్కారము గుణముల ననుసరింపక యుండుటలేదు.

అలంకారము : ఏకావళి.

వ్యాఖ్యానము : సామము, దానము, భేదము, దండము అని రాజులు చతుర్విధములయిన యుపాయములను ప్రయోగించి యితరులను వశపరచు కొందురు. వీనిలో దుర్యోధనుడు సామము, దానము అను రెండు ఉపాయము లను మాత్రమే ప్రధానముగా ప్రజలయెడ ప్రయోగించుచుండెను. ఈ రెంటిని గూడ ప్రత్యేకము ప్రయోగించుటలేదు. దానముతో కలిపియే సామమును ప్రయో గించుచుండెను. ఆ దానము కూడ చాలా పెద్దది. దానిని గూడ సత్కారముతో కలిపియే ప్రయోగించుచుండెను. ఆ సత్కారమును గూడ గుణములు చూచియే ప్రయోగించుచుండెను. తన రాజ్యమున ధైర్య శౌర్యాది గుణములుగల వారికి తీయని మాటలు చెప్పి కావలసిన ధనము సత్కార రూపమున సమర్పించి దుర్యో ధనుడు వారిని తనకు అనుకూలురను గావించుకొనుచుండెను. వారందరు గుణ వంతులే యనుటవల్ల గుణవంతులైన పాండవులయందు ఇంతవరకు అనురక్తులై యున్నవారినే దుర్యోధనుడు తన పక్షమునకు త్రిప్పుకొనుచుండెనని గ్రహింప

పలెను. అట్టివారు భేద దండములవల్ల తనపట్ల మరింత వ్యతిరేక భావముగల వారగుదురు గనుక దుర్యోధనుడు ఆ యుపాయములను అవలంబింపలేదు.

దానము సామమునకు, సత్క్రియ దానమునకు, గుణశాలిత సత్క్రియకు విశేషణములుగా మాలా రూపమున కూర్పబడినవి గనుక ఇది ఏకావళి యను నలంకారము.

శ్లో॥ వసూని వాంఛన్ న వశీ న మన్యునా
స్వధర్మ ఇత్యేవ నివృత్త కారణః
గురూపదిష్టేన రిపౌ సుతేఽపి వా
నిహంతి దండేన స ధర్మ విప్లవమ్. 13

పదవిభాగము : వసూని, వాంఛన్, న, వశీ, న, మన్యునా, స్వధర్మః, ఇతి, ఏవ, నివృత్తకారణః, గురూపదిష్టేన, రిపౌ, సుతే, అపి, వా, నిహంతి, దండేన, సః, ధర్మ విప్లవం.

అన్వయము : వశీ సః వసూని వాంఛన్ న, మన్యునా (చ) న; (కింతు) నివృత్తకారణః (సన్) స్వధర్మః ఇతి ఏవ గురూపదిష్టేన దండేన రిపౌ సుతే అపి వా (స్థితం) ధర్మవిప్లవం నిహంతి.

అర్థము : వశీ = ఇంద్రియనిగ్రహముగల ; సః = ఆ దుర్యోధనుడు ; వసూని = ధనములను; వాంఛన్ = కోరుచున్నవాడై న-హంతి = శిక్షించుటలేదు; కింతు = మరేమనిన; నివృత్త-కారణః (సన్) = పోయిన కారణములుగల వాడగుచు, (లోభాది కారణములు లేకుండనే); స్వ - ధర్మః-ఇతి + ఏవ = తన (రాజ) ధర్మముగదాయనియే; గురూపదిష్టేన = న్యాయనిర్ణేతచే ఉపదేశింపబడిన ; దండేన = దండనచేత ; రిపౌ = శత్రువునందుగాని; సుతే-అపి-వా = పుత్రునియందైనను గాని ; స్థితం = ఉండిన; ధర్మ-విప్లవం = ధర్మ వ్యతిక్రమమును; నిహంతి = నివారించుచున్నాడు.

తాత్పర్యము : ఇంద్రియ నిగ్రహముగల యా దుర్యోధనుడు ధనములను గోరి కాని, క్రోధముచేతగాని శిక్షించుటలేదు. లోభ క్రోధాది కారణము లెవ్వియు

లేకుండగనే అది తన రాజధర్మము గదా యని మాత్రమే ప్రాడ్వివాకులచే నిర్ణయింపబడిన దండముచేత శత్రువునందుగాని, పుత్రునియందైనగాని ధర్మ వ్యతిక్రమమును నివారించుచున్నాడు.

వ్యాఖ్యానము : ధనాపేక్షచేగాని, క్రోధముచేగాని దుర్యోధనుడు అపరాధు లను దండించుటలేదు. దండ్యులను దండించుట రాజధర్మము గనుక దండించు చుండెను. అదియును న్యాయ నిర్ణేతల నిర్ణయము ననుసరించియే చేయుచుండెను. దండన విషయమున శత్రువు, స్వీయపుత్రుడు అన్న భేదమును అతడు పాటిం చుటలేదు. ఇది యంతయు ప్రజానురక్తిని సంపాదించి రాజ్యముపై తన యక్రమ లబ్ధాధికారమును స్థిరపరచుకొనుటకే.

క్రోధ లోభ వివర్జితుడై ధర్మశాస్త్రానుసారమున రాజు దండమును ప్రయో గింపవలెనన్న రాజధర్మమును దుర్యోధనుడు అక్షరశః పాటించుచుండెనని భావము.

"అదండ్యాన్ దండయన్ రాజా
దండ్యాం శ్చాప్య దండయన్
అయశో మహదాప్నోతి
నరకం చాధిగచ్ఛతి"

అను న్యాయమున ధర్మజుని మించు కీర్తిని ఆర్జింపబూనిన దుర్యోధనుడు దండ్యులను దండింపక, అదండ్యులను దండించి అయశస్సు నార్జింప నిచ్ఛ గింపడుగదా.

"ధర్మశాస్త్రం పురస్కృత్య
ప్రాడ్వివాక మతే స్థితః
సమాహిత మతిః పశ్యేత్
వ్యవహారా ననుక్రమాత్."

దండ నిర్ణయమున ప్రాడ్వివాకులకు ధర్మశాస్త్ర మాధారము. ప్రాడ్వివాకుల నిర్ణయము రాజునకు ఆధారము. అప్పుడే రాజు లోభ క్రోధ వివర్జితుడై సమ బుద్ధితో స్వపరభేదములేకుండ దండ్యులను యథార్థముగా దండింపగలడు. అట్టి

దండము ప్రజలకు ఉద్వేగము కలిగింపదు. అతని కీర్తికి వన్నె పెట్టును. కీర్తికాంక్షియైన దుర్యోధనుడీ పద్ధతి యవలంబించెను.

'ధర్మవిప్లవం' అన్నప్పుడు వర్ణాశ్రమ ధర్మముల భంగము అని గ్రహింపవలెను. అధర్మపరులలో అగ్రేసరుడైన దుర్యోధనుడు ప్రజారంజనార్థము రక్షించు ధర్మము లివియేయై యుండవలయును.

శ్లో॥ విధాయ రక్షాన్ పరితః పరేతరా
నశంకితాకార ముపైతి శంకితః
క్రియాపవర్గే ష్వనుజీవి సాత్కృతాః
కృతజ్ఞతా మస్య వదంతి సంపదః. 14

పదవిభాగము : విధాయ, రక్షాన్, పరితః, పరేతరాన్, అశంకితాకారం, ఉపైతి, శంకితః, క్రియాపవర్గేషు, అనుజీవి సాత్కృతాః, కృతజ్ఞతాం, అస్య, వదంతి, సంపదః.

అన్వయము: (సః) శంకితః (సన్) పరితః పరేతరాన్ రక్షాన్ విధాయ అశంకితాకారం ఉపైతి ; క్రియాపవర్గేషు అనుజీవి సాత్కృతాః సంపదః అస్య కృతజ్ఞతాం వదంతి.

అర్థము : సః = ఆ దుర్యోధనుడు; శంకితః (సన్) = శంకగలవాడై ; పరితః = అంతటను; పరేతరాన్ = పరులుకాని, తనకు ఆప్తులయిన; రక్షాన్ = రక్షకులను ; విధాయ = ఏర్పాటుచేసి; అశంకిత + ఆకారం = శంకలేనివాని యాకారమును; ఉపైతి = పొందుచున్నాడు; క్రియా-అపవర్గేషు = కార్యముల యొక్క అంతములయందు; అనుజీవి-సాత్కృతాః = భృత్యుల వశముగావింపబడిన ; సంపదః = సంపదలు; అస్య = దుర్యోధనుని యొక్క; కృతజ్ఞతాం = కృతజ్ఞతను ; వదంతి = చెప్పుచున్నవి.

తాత్పర్యము : ఆ దుర్యోధనుడు శంకగలవాడై సర్వదేశములందును తనకు విశ్వాసపాత్రులైన రక్షకులను నియమించి శంకలేనివాని తీరున ఉండును. కార్యములు సమాప్తినందినప్పుడు భృత్యులవశము గావింపబడు సంపదలు అతని కృతజ్ఞతను వెల్లడిచేయుచున్నవి.

వ్యాఖ్యానము : తన పట్ల అనురక్తులైన వారిని స్వపరరాష్ట్రములందు తన రహస్యాలోచనలను గుప్తముగా నుంచగలవారిని నియమించి దుర్యోధనుడు ఎల్లరను నమ్ముచున్నట్లే కనబడుచు ఎవ్వరిని నమ్మక అట్టి మంత్ర రక్షకులను గూడ ఒక కంట కనిపెట్టుచునే యుండెను. మంత్ర రక్షకులు తమ కర్తవ్యమును విజయవంతముగా నెరవేర్చినప్పుడు వారిని విశేష ధనముతో సత్కరించి తన కృతజ్ఞతను వెల్లడించుచుండెను. రాజు కృతజ్ఞుడైనచో అనుచరులు వానియందనురక్తులై యతనిని రక్షింతురు. కనుక దుర్యోధనుడు మంత్రరక్షకులకు కృతజ్ఞతా సూచకముగా మహాధనము లిచ్చుచుండెను.

'పరేతరాన్' అనగా పరులు కానివారిని, ఆత్మీయులను అని యర్థము. లేదా పరులను, ఇతరులనుగా చేయువారిని అనగా శత్రువులనుగూడ భేదోపాయమున మిత్రులను గావించుటకు సమర్థులైనవారిని అనియు నర్థము చెప్పవచ్చును. లేదా పరులను. ఇతరులను అనగా శత్రువులను మిత్రులనుగూడ అశంకితాకారమున జూచుచుండెననియు తలంపవచ్చును. దుర్యోధనుడు ఎవ్వరిని నమ్మకుండియు నమ్ముచున్నట్లు నటించుచు ఇతరులచేతనే ఇతరులను భేదించుచుండెనని భావము.

శ్లో॥ అనారతం తేన పదేషు లంభితా
విభజ్య సమ్య గ్వినియోగ సత్క్రియాః
ఫలంత్యుపాయాః పరిబృంహితాయతీ
రుపేత్య సంఘర్ష మివార్థ సంపదః. 15

పదవిభాగము : అనారతం, తేన, పదేషు లంభితాః, విభజ్య, సమ్యక్, వినియోగ సత్క్రియాః, ఫలంతి, ఉపాయాః, పరిబృంహితాయతీః, ఉపేత్య, సంఘర్షం, ఇవ, అర్థసంపదః.

అన్వయము : తేన పదేషు సమ్యక్ విభజ్య వినియోగ సత్క్రియాః లంభితాః ఉపాయాః సంఘర్షం ఉపేత్య ఇవ పరిబృంహితాయతీః అర్థసంపదః అనారతం ఫలంతి.

అర్థము : తేన = ఆ దుర్యోధనునిచేత ; పదేషు = వస్తువులందు ; సమ్యక్ = తగు విధముగా; విభజ్య = విభజించి; వినియోగ = వినియోగమనెడి;

సత్క్రియాః = సత్కారముగలవై; లంభితాః = ప్రయుక్తములైన; ఉపాయాః = ఉపాయములు; సంఘర్షం = స్పర్థను ; ఉపేత్య-ఇవ = పొందినవా యన్నట్లు ; పరిబృంహిత = వృద్ధి పొందింపబడిన; ఆయతీః = ఉత్తరకాలములు గల; అర్థ-సంపదః = ధనసముదాయములను; అనారతం = ఎల్లప్పుడు; ఫలంతి = ప్రసవించుచున్నవి.

తాత్పర్యము : ఆ దుర్యోధనునిచేత పొందదగిన వస్తువులందు ప్రత్యేకముగా విభజించి వినియోగమను సత్కారము గలవై ప్రయుక్తములైన సామాది చతురుపాయములు పరస్పరము స్పర్ధపహించినవా యన్నట్లు అతిశయమైన యుత్తరకాలములు గల ధనసముదాయములను నిరంతరము ప్రసవించుచున్నవి.

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము: పొందదగిన వస్తువు లక్షణమునుబట్టి దుర్యోధనుడు సామాదులైన యుపాయములలో ఉచితమైన దానిని ఆ విషయమున ప్రయోగించుచుండెను. యథాస్థానమున ప్రయోగింపబడిన ఆ యుపాయములు ఫలవంతములగుచుండెను. ఈ విధముగా చతురుపాయములును యథోచిత ప్రయోగమువల్ల పరస్పరము స్పర్ధపడినవా యన్నట్లు ఒకదానిని మించి యొకటి ఆ దుర్యోధనునకు స్థిరమైన యర్థసంపదను ప్రసవించుచుండెను.

చతురుపాయములు పరస్పరము సంఘర్షము పొందకున్నను పొందినట్లు ఊహింపబడుటచే ఉత్ప్రేక్షాలంకారము.

శ్లో॥ అనేక రాజన్య రథాశ్వసంకులం
తదీయ మాస్థాన నికేతనాజిరమ్
నయ త్యయుగ్మచ్ఛదగంధి రార్ద్రతాం
భృశం నృపోపాయనదంతినాం మదః. 16

పదవిభాగము : అనేక రాజన్య రథాశ్వసంకులం, తదీయం, ఆస్థాననికేతనాజిరం, నయతి, అయుగ్మచ్ఛదగంధిః, ఆర్ద్రతాం, భృశం, నృపోపాయన

అన్వయము : నృపోపాయన దంతినాం అయుగ్మచ్ఛదగంధిః మదః అనేక రాజన్య రథాశ్వ సంకులం తదీయం ఆస్థాన నికేతనాజిరం భృశం; ఆర్ద్రితాం నయతి.

అర్థము: నృప = రాజులయొక్క; ఉపాయన = కానుకలైన; దంతినాం = ఏనుగులయొక్క; అయుగ్మచ్ఛద = ఏడాకుల యరటిపూవుయొక్క; గంధిః = గంధమువంటి గంధముగల; మదః = మదము; అనేక = పలువురైన; రాజన్య = రాజపుత్రులయొక్క; రథ = రథములచేత; అశ్వ = అశ్వములచేత; సంకులం = సమ్మర్దముగా నున్న; తదీయం = ఆ దుర్యోధనునకు సంబంధించిన; ఆస్థాన-నికేతన = సభామందిరముయొక్క; అజిరం = ముంగిలిప్రదేశమును; భృశం = మిక్కిలిగా; ఆర్ద్రితాం = తడిసిన స్థితిని; నయతి = పొందించు చుండును.

తాత్పర్యము : రాజులు ఉపాయనములుగా నొసంగిన యేనుగులయొక్క ఏడాకుల యరటిపూవు వాసనగల మదజలము పలువురు రాజకుమారుల రథములచే, అశ్వములచే సమ్మర్దముగా నుండు ఆ దుర్యోధనుని యాస్థాన మందిర ప్రాంగణమును మిక్కిలి తడిసినదానినిగా జేయుచుండును.

అలంకారము : ఉదాత్తము.

వ్యాఖ్యానము : దుర్యోధనుడు సార్వభౌముడు. ఆయనకు సామంతులయిన రాజన్యులు నానాదేశములనుండి వచ్చి యాయన సభామందిర ప్రాంగణమున దర్శనార్థులై మూగుదురు. ప్రభుదర్శనమునకు వచ్చిరి గనుక ప్రభు ప్రీతికై వారు కానుకలుగా దెచ్చిన మదపు టేనుగుల మదజలముచే ఆయన ఆస్థాన మందిర ప్రాంగణము తడిసి బురదయగు చుండును. ఆ రాజన్యు లెక్కివచ్చిన రథముల యశ్వములచే ప్రాంగణమంతయు కిటకిటలాడు చుండును. దుర్యోధనునిపట్ల రాజులకు అంతభక్తి. అతని దర్శనము కొఱకు వారు అంత పడిగాపులు పడి యుందురు. వారు కానుకలుగా తెచ్చిన గజములు మదించినవే కాక వాని మదము ఏడాకుల యరటిపూల వాసన గలది యగుటచే అవి భద్రజాతి గజములు. ఇది యంతయు దుర్యోధనుని వైభవ సమృద్ధిని సూచించు చున్నది. సమృద్ధ వస్తు వర్ణనమువల్ల నిది ఉదాత్తాలంకారము.

"ఎవ్వాని వాకిట నిభమద పంకంబు
రాజభూషణ రజో రాజి నడఁగు"

అని తిక్కన ధర్మజుని వైభవమును వర్ణించుచు బలికిన వాక్యము భారవి వాక్యము ననుసరించుచు, దానికి మెఱుగులు పెట్టుచున్నది.

దుర్యోధనుడు అవలంబించుచుండిన రాజనీతి చక్కఁగా ఫలించి రాజలోక మంతయు ఆతనికి వశవర్తియై యున్నదని భావము.

శ్లో॥ సుఖేన లభ్యా దధతః కృషీవలై
రకృష్టపచ్యా ఇవ సస్య సంపదః
వితన్వతి క్షేమ మదేవమాతృకా
శ్చిరాయ తస్మిన్ కురవశ్చకాసతి. 17

పదవిభాగము : సుఖేన, లభ్యాః, దధతః, కృషీవలైః, అకృష్టపచ్యాః, ఇవ, సస్యసంపదః, వితన్వతి, క్షేమం, అదేవ మాతృకాః, చిరాయ, తస్మిన్, కురవః, చకాసతి.

అన్వయము : చిరాయ తస్మిన్ క్షేమం వితన్వతి (సతి) అదేవ మాతృకాః కురవః అకృష్టపచ్యాః ఇవ కృషీవలైః సుఖేన లభ్యాః సస్యసంపదః దధతః (సంతః) చకాసతి.

అర్థము : చిరాయ = చిరకాలముగా; తస్మిన్ = ఆ దుర్యోధనుడు; క్షేమం = క్షేమమును; వితన్వతి (సతి) = కలిగించువాడగుచుండగా; అదేవ-మాతృకాః = నదీమాతృకములగు; కురవః = కురుదేశములు; అకృష్ట = దున్నబడక; పచ్యాః-ఇవ = పండినవా యన్నట్లు; కృషీవలైః = కర్షకులచేత; సుఖేన = సుఖముచే; లభ్యాః = పొందదగిన; సస్య = పైరుల; సంపదః = సమృద్ధులను; దధతః = ధరించుచున్నవై; చకాసతి = ప్రకాశించు చున్నవి.

తాత్పర్యము : చిరకాలముగా ఆ దుర్యోధనుడు క్షేమమును కలిగించు చుండగా నదీమాతృకములైన కురుదేశములు దున్నకయే పండుచున్నవా యన్నట్లు కర్షకులచే సుఖముగా పొందదగిన సస్య సంపదలను ధరించుచున్నవై ప్రకాశించు చున్నవి.

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : దుర్యోధనుడు ప్రజాహితములైన కార్యములు చేయుచు కర్షకులకు ఎంతో క్షేమము చేకూర్చు చున్నాడు.

పూర్వము దేవమాతృకములుగా నుండిన కురుదేశములు ఇప్పుడు నదీ మాతృకములై నవి. దుర్యోధనుడు పెక్కుకాలువలు త్రవ్వించి నదీజలములను కర్షకులకు ఉపయోగకరములు గావించెను. కేవలము వర్షజలములపై కర్షకులాధార పడనక్కరలేదు. నదీజలములు పుష్కలముగా అందుబాటులో నుండుటచే కర్షకులు దున్నకుండగానే భూములు పండుచున్నవా యన్నట్లుండెను.

అకృష్టములై పండకున్నను అకృష్టములై పండుచున్నట్లు భావింప బడుటచే ఉత్ప్రేక్షాలంకారము.

దేవమాతృకములనగా పర్జన్య దేవుడే ఫలాధారముగా గలవి. అదేవ మాతృకములనగా నదీమాతృకములు.

"దేశో నద్యంబు వృష్ట్యంబు సంపన్న వ్రీహి పాలితః.
స్యాన్నదీ మాతృకో దేవమాతృకశ్చ యథాక్రమం" — అమరము.

దుర్యోధనుడు రాజులనే కాక కర్షకులను గూడ తనయం దనురక్తులను గావించు కొనెనని భావము. జనపదము లన్నియు సస్యాది సంపత్సమృద్ధములై యుండునట్లు దుర్యోధనుడు ప్రజాహిత కార్యము లాచరించుచు, ప్రజారంజకుడై యున్నాడు గనుక అతనిని సాధించుట కష్టమని వ్యంగ్యము.

శ్లో॥ ఉదారకీర్తే రుదయం దయావతః
ప్రశాంతబాధం దిశతోఽభిరక్షయా
స్వయం ప్రదుగ్ధేఽస్య గుణై రుపస్నుతా
వసూపమానస్య వసూని మేదినీ. 18

పదవిభాగము : ఉదార కీర్తేః, ఉదయం, దయావతః, ప్రశాంతబాధం, దిశతః, అభిరక్షయా, స్వయం, ప్రదుగ్ధే, అస్య, గుణైః, ఉపస్నుతా, వసూప మానస్య, వసూని, మేదినీ.

అన్వయము : ఉదారకీర్తేః దయావతః అభిరక్షయా ప్రశాంత బాధం ఉదయం దిశతః వసూపమానస్య అస్య గుణైః ఉపస్నుతా మేదినీ వసూని స్వయం ప్రదుగ్ధే.

అర్థము : ఉదార-కీర్తేః = గొప్పదైన కీర్తిగలవాడు; దయావతః = దయగలవాడు; అభిరక్షయా = సంరక్షణచేత; ప్రశాంత-బాధం = శాంతించిన బాధలు కలుగునట్లుగా; ఉదయం = అభ్యుదయమును; దిశతః = కలిగించుచున్న వాడు; వసు + ఉపమానస్య = కుబేరునితో సమానమైన వాడునైన; అస్య = దుర్యోధనుని యొక్క; గుణైః = సద్గుణములచేత; ఉపస్నుతా = చేపువచ్చునట్లు చేయబడిన; మేదినీ = భూమి; వసూని = ధనములను; స్వయం = స్వయముగా; ప్రదుగ్ధే = ఇచ్చుచున్నది.

తాత్పర్యము : గొప్పకీర్తి గలవాడు, దయాశాలి, సంరక్షణచే సర్వబాధలు శమించు తీరున అభ్యుదయము గలిగించువాడు, కుబేరునితో సాటియైనవాడునైన ఆ దుర్యోధనుని దయాది సద్గుణములచే ఆర్ద్రితపొందిన భూమి స్వయముగానే ధనములను ఇచ్చుచున్నది.

అలంకారము : సమాసోక్తి.

వ్యాఖ్యానము : ప్రజాక్షేమంకరములైన యుత్తమ కార్యములు చేయుచు దుర్యోధనుడు దయాదానాదులైన యుదారగుణములను ప్రదర్శించుచుండెను. ఆతని గుణములచే అనురక్తయై చేపు వచ్చినదా యన్నట్లు భూమి స్వయముగా ఆతనికి ధనములను ప్రసవించుచుండెను. 'వసూపమానస్య' అని దుర్యోధనునకు కుబేర సామ్యము చెప్పబడుటచే ఆతని అర్థాభివృద్ధికి ప్రాధాన్యము సూచింప బడినది. వనమందున్న ధర్మజునకు ధర్మాభివృద్ధి యగుచుండ, రాజ్యమందున్న దుర్యోధనునకు అర్థ పురుషార్థము వర్ధిల్లు చుండెనని భావము. ఈతిబాధలు లేనందున ధనధాన్యవృద్ధి పెల్లుగా జరుగుచుండెను. ధనధాన్య సంపత్సమృద్ధి గలిగించు చున్న అతని పట్ల ప్రజలు విశ్వాసము గలిగి యుండిరని సూచన.

'ఉపస్నుతా', 'ప్రదుగ్ధే' యను శబ్దముల బలమువల్ల చక్కగా రక్షింప బడిన ధేనువు యజమానికి స్వయముగా అనురక్తయై దుగ్ధము లిచ్చుట యను నర్థాంతరము గమ్యమానమగుటచే సమాసోక్తి అలంకారము. గుణములచే ఉప

స్నుత కాకున్నను అయినట్లు భావింప బడుటచే ఉత్ప్రేక్షాలంకారధ్వని. ప్రతీయమానమైన గోపనకు మేదినికి భేదమున్నను లేనట్లు 'ప్రదుగ్ధే' యను క్రియచే సూచింప బడుటచే అభేదాతిశయోక్తి ధ్వని.

శ్లో॥ మహౌజసో మానధనా ధనార్చితా
ధనుర్భృత స్సంయతి లబ్ధ కీర్తయః
న సంహతా స్తస్య న భిన్న వృత్తయః
ప్రియాణి వాంఛం త్యసుభి స్సమీహితుమ్. 19

పదవిభాగము : మహౌజసః, మానధనాః, ధనార్చితాః, ధనుర్భృతః, సంయతి, లబ్ధకీర్తయః, న, సంహతాః, తస్య, న, భిన్నవృత్తయః, ప్రియాణి, వాంఛంతి, అసుభిః, సమీహితుం.

అన్వయము : మహౌజసః మానధనాః ధనార్చితాః సంయతి లబ్ధకీర్తయః న సంహతాః న భిన్నవృత్తయః ధనుర్భృతః అసుభిః తస్య ప్రియాణి సమీహితుం వాంఛంతి.

అర్థము : మహా + ఓజసః = గొప్పశక్తి గలవారు; మాన-ధనాః = మానమే ధనముగా గలవారు; ధన + అర్చితాః = ధనముచే పూజింపబడిన వారు; సంయతి = యుద్ధమునందు; లబ్ధ-కీర్తయః = పొందబడిన కీర్తిగలవారు; న-సంహతా = స్వార్థము కొఱకు ఏకము కానివారు; న-భిన్నవృత్తయః = పరస్పర విరుద్ధ ప్రవర్తనలు లేనివారునైన; ధనుర్భృతః = విలుకాండ్రు; అసుభిః = ప్రాణములచే; తస్య = ఆ దుర్యోధనునకు; ప్రియాణి = ప్రియములను; సమీహితుం = చేయుటకు; వాంఛంతి = కోరుచున్నారు.

తాత్పర్యము : గొప్ప బలముగలవారు, మానమే ధనముగా గలవారు, ధనముచే అర్చింపబడినవారు, యుద్ధమున లబ్ధకీర్తులు, స్వార్థము కొరకు ఏకము కానివారు, పరస్పర విరుద్ధముగా వర్తింపనివారునైన ధనుర్ధరులు తమ ప్రాణము లర్పించియైనను ఆ దుర్యోధనునకు ప్రియములు చేయగోరుచున్నారు.

అలంకారము : కావ్యలింగము, పరికరము.

వ్యాఖ్యానము : ప్రతాపవంతులు, మానధనులు, యుద్ధమున లబ్ధ ప్రతిష్ఠులు నైన మహావీరులను దుర్యోధనుడు ధనములచే అర్చించి వశపఱచు కొనెను. వారు ఆతనిపట్ల కృతజ్ఞతా భావము గలవారై స్వార్థపరతచే ఆతనికి వ్యతిరేకముగా కూటమి కట్టుటకాని, పరస్పరము విరోధించి ఆతనికి విరుద్ధముగా ప్రవర్తించుటగాని చేయక అతనిపట్ల బద్ధానురాగులై ఋణ విముక్తికొఱకు స్వామి కార్యసాధనయందు ప్రాణములనైన కోల్పోవ సిద్ధముగా నున్నారు. అట్టి మహావీరుల బలమును చూచుకొని దుర్యోధనుడు యుద్ధము అనివార్య మైనచో విజయము తనకే లభించునన్న ధైర్యముతో నున్నాడు.

మానధనత్వాది విశేషణములు సాభిప్రాయములగుటచే పరికరాలంకారము. ఆ విశేషణములు ప్రాణార్పణ సంసిద్ధతకు హేతువులుగా నిబంధింపబడుటచే కావ్య లింగాలంకారము. ఈ రెండలంకారములు స్వతంత్రములుగా నుండుటచే సంసృష్టి.

శ్లో॥ మహీభృతాం సచ్చరితైశ్చరైః క్రియా
స్సవేద నిశ్శేష మశేషిత క్రియః
మహోదయై స్తస్య హితానుబంధిభిః
ప్రతీయతే ధాతు రివేహితం ఫలైః. 20

పదవిభాగము : మహీభృతాం, సచ్చరితైః, చరైః, క్రియాః, సః, వేద, నిశ్శేషం, అశేషితక్రియః, మహోదయైః, తస్య, హితాను బంధిభిః, ప్రతీయతే, ధాతుః, ఇవ, ఈహితం, ఫలైః.

అన్వయము : అశేషితక్రియః సః సచ్చరితైః చరైః మహీభృతాం క్రియాః నిశ్శేషం వేద; ధాతుః ఇవ తస్య ఈహితం మహోదయైః హితాను బంధిభిః ఫలైః ప్రతీయతే.

అర్థము : అశేషిత = సమాప్తము చేయబడిన; క్రియః = కార్యముగల; సః = ఆ దుర్యోధనుడు; సచ్చరితైః = యోగ్యమైన చరిత్రముగల; చరైః = చారులచేత; మహీభృతాం = రాజులయొక్క; క్రియాః = క్రియలను; నిశ్శేషం = సంపూర్ణముగా; వేద = తెలిసికొను చున్నాడు; ధాతుః-ఇవ = బ్రహ్మ యొక్క

వలె; తస్య = వానియొక్క; ఈహితం = ప్రయత్నము; మహోదయైః = గొప్పయభివృద్ధి గలవి; హిత + అనుబంధిభిః = మేలును అనుసరించునవి యైన; ఫలైః = ఫలములచేత; ప్రతీయతే = తెలియబడు చున్నది.

తాత్పర్యము : సమాప్తము చేయబడిన కార్యములుగల ఆ దుర్యోధనుడు యోగ్యమైన నడవడి గల గూఢచారులచే రాజులయొక్క క్రియలను సంపూర్ణముగా దెలిసికొను చున్నాడు. బ్రహ్మయొక్క ప్రయత్నమువలె ఆ దుర్యోధనుని ప్రయత్నము గొప్ప యభివృద్ధి గలిగి హితానుసారులైన ఫలములచేత తెలియబడుచున్నది.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : దుర్యోధనుడు మిక్కిలి జాగరూకుడై యథాకాలమున తన కార్యములను చేయుచు, ఇతర రాజులు ఏ కారణములవల్ల ఏకార్యములు చేయుచున్నారో ఎప్పటికప్పుడు విశ్వాసపాత్రులు, నిపుణులు నైన చారుల వలన దెలిసికొనుచున్నాడు. బ్రహ్మదేవుడు ఏకార్యమును ఏల చేయుచున్నాడో తెలిసికొన శక్యము కానట్లు దుర్యోధనుడు ఏ కార్యమును ఏల చేయుచున్నాడో ఆ కార్యఫలమును బట్టి తెలిసికొన వలసినదే తప్ప ముందుగా తెలియశక్యము గాకున్నది. మంత్రరహస్యములను అతడు అంత భద్రముగా రక్షించుకొను చున్నాడు.

నీవు అతని రహస్యములను దెలిసికొను చున్నట్లే అతడును నీ రహస్యములను గూఢచారుల వలన దెలిసికొనుచునే యున్నాడు అని భావము. దుర్యోధనుని కార్యారంభములు బ్రహ్మ కార్యారంభములతో ఉపమింపబడుటచే ఉపమాలంకారము. సురక్షితమై సుప్రయుక్తమైన దుర్యోధనుని మంత్రము అతనికి హితకరమైన మహాఫలములను సమకూర్చు చున్నది. స్వరాష్ట్రమునందలి వృత్తాంతములను దెలిసికొనుచున్నట్లే దుర్యోధనుడు పరరాష్ట్రము లందలి రహస్యములను గూడ తెలిసికొను చుండెను.

శ్లో॥ న తేన సజ్యం క్వచి దుద్యతం ధనుః
కృతం నవా కోప విజిహ్మ మాననమ్
గుణానురాగేణ శిరోభి రుహ్యతే
నరాధిపై ర్మాల్య మివాస్య శాసనమ్. 21

పదవిభాగము : న, తేన, సజ్యం, క్వచిత్, ఉద్యతం, ధనుః, కృతం, న, వా, కోపవిజిహ్మం, ఆననం, గుణానురాగేణ, శిరోభిః, ఉహ్యతే, నరాధిపైః మాల్యం, ఇవ, అస్య, శాసనం.

అన్వయము : తేన క్వచిత్ సజ్యం ధనుః న ఉద్యతం; ఆననం వా కోప విజిహ్మం న కృతం; నరాధిపైః అస్య శాసనం గుణానురాగేణ మాల్యం ఇవ శిరోభిః ఉహ్యతే.

అర్థము : తేన = ఆ దుర్యోధనునిచే; క్వచిత్ = ఎచ్చటను; సజ్యం = నారితో గూడిన; ధనుః = విల్లు; న-ఉద్యతం = ఎత్తబడలేదు; ఆననం-వా = ముఖమైనను; కోప = కోపముచే; విజిహ్మం = కుటిలమైనదిగా; న-కృతం = చేయబడలేదు; నరాధిపైః = రాజులచేత; అస్య = వానియొక్క; శాసనం = ఆజ్ఞ; గుణ + అనురాగేణ = గుణము లందలి ప్రీతిచేత; మాల్యం-ఇవ = పూలదండవలె; శిరోభిః = శిరస్సులచేత; ఉహ్యతే = వహింపబడు చున్నది.

తాత్పర్యము : ఆ దుర్యోధనునిచే నారితోగూడిన ధనువు ఎచ్చటను ఎత్తబడలేదు. ముఖమైనను కోపముచే కుటిలము చేయబడలేదు. రాజులచేత అతని యాజ్ఞ గుణములందలి ప్రీతిచేత పూలదండవలె శిరస్సులచే వహింపబడు చున్నది.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : పరరాజులను వశపరచు కొనుటకై దుర్యోధనుడు సామ దాన భేదములనే తప్ప దండమును ప్రయోగించుట లేదు. అతడెన్నడు విల్లెక్కు పెట్టలేదు. అతని ముఖమెన్నడును కోపముచే వికృతము కాలేదు. అతని దయా దానాది గుణములచేతనే వశీకృతులైన రాజులు అతని యాజ్ఞలను పూలదండలను వలె శిరస్సులందు ధరించుచున్నారు. దుర్యోధనుని మిత్రబలసంపద యిందు వ్యక్తము చేయబడినది.

శాసనమునకు మాల్యముతో సాదృశ్యము చెప్పబడుటచే ఉపమాలంకారము. ఈ యౌపమ్యమువల్ల దుర్యోధనుని శాసనముల మార్దవము, రంజకత వ్యక్త మగు చున్నవి. 'గుణ' శబ్దమునకు ఆజ్ఞల విషయమున దయాదిగుణములు, మాల్యవిషయమున సూత్రము అని యర్థములు గ్రహింప వలెను. మాల్యపక్ష

మున సౌరభవర్ణాది గుణము అను నర్థమును కూడ గ్రహింప వచ్చును. సమాన ధర్మము శ్లేషాశ్రితమగుటచే ఇందలి యుపమ శ్లేషానుప్రాణితమని భావింప వగును.

శ్లో॥ స యౌవరాజ్యే నవయౌవనోద్ధతం
నిధాయ దుశ్శాసన మిద్ధ శాసనః
మఖేష్వఖిన్నోఽనుమతః పురోధసా
ధినోతి హవ్యేన హిరణ్యరేతసమ్. 22

పదవిభాగము : సః, యౌవరాజ్యే, నవయౌవనోద్ధతం, నిధాయ, దుశ్శాసనం, ఇద్ధ శాసనః, మఖేషు, అఖిన్నః, అనుమతః, పురోధసా, ధినోతి, హవ్యేన, హిరణ్యరేతసం.

అన్వయము : ఇద్ధ శాసనః సః నవయౌవనోద్ధతం దుశ్శాసనం యౌవరాజ్యే నిధాయ పురోధసా అనుమతః అఖిన్నః మఖేషు హవ్యేన హిరణ్యరేతసం ధినోతి.

అర్థము : ఇద్ధ-శాసనః = దీప్తమైన శాసనముగల; సః = ఆ దుర్యోధనుడు; నవ = క్రొత్త; యౌవన = యౌవనముచే; ఉద్ధతం = గర్వితుడైన; దుశ్శాసనం = దుశ్శాసనుని; యౌవరాజ్యే = యువరాజ పదవియందు; నిధాయ = ఉంచి; పురోధసా = పురోహితునిచే; అనుమతః = అనుమతింప బడినవాడై; అఖిన్నః = శ్రమలేనివాడై; మఖేషు = యాగములందు; హవ్యేన = హోమ ద్రవ్యముచేత; హిరణ్య రేతసం = అగ్నిని; ధినోతి = సంతోషపెట్టు చున్నాడు.

తాత్పర్యము : ప్రదీప్తమైన శాసనముగల ఆ దుర్యోధనుడు నూత్న యౌవనముచే దర్పితుడైన దుశ్శాసనుని యువరాజ పదవియందు ఉంచి పురోహితునిచే అనుమతింప బడినవాడై శ్రమయెఱుగక యాగములందు ఆజ్యాది హవిస్సుచే అగ్నిని ఆరాధించు చున్నాడు.

వ్యాఖ్యానము : దుర్యోధనుడు రాజనీతిని, పాలనా విధానమును మాత్రము నిర్ణయించుచు వానిని అనుష్ఠించు భారము దుశ్శాసనునిపై నుంచెను. నవయౌవనముచే గర్వించియున్న దుశ్శాసనుడు యువరాజ పదస్థుడై అన్నగారి శాసనములను

తీవ్రముగా అమలు జరుపుచుండెను. దండనాదుల యందు తీవ్రత యుండినచో ఆ దోషము దుశ్శాసనునిపై ప్రజలకు దుర్యోధనునివట్ల ప్రీతి సడలకుండెను. ప్రదీప్తములైన తన శాసనములను అమలుపరచు బాధ్యత యువరాజైన దుశ్శాసనుడు వహింపగా దుర్యోధనుడు పురోహితుల యనుమతితో నిరంతరము యాగ కార్యములందు మగ్నుడై యగ్నిని తృప్తి పరచుచుండెను.

"హిరణ్య రేతసమ్" అని యగ్ని నిర్దేశింపబడుటచే దుర్యోధనుని యాగములకును సువర్ణాది ధనలబ్ధియే ప్రయోజనమని భావింపదగును. క్రతువు లొనర్చి భూరిదక్షిణల చేతను, మృష్టాన్నముల చేతను దుర్యోధనుడు వేదవిప్రుల యాశీర్వచనములు, దేవతల యనుగ్రహము సంపాదింప యత్నించు చుండెనని భావము.

శ్లో॥ ప్రలీనభూపాల మపి స్థిరాయతి
ప్రశాస దావారిధి మండలం భువః
స చింతయత్యేవ భియ స్త్వ దేష్యతీ
రహో దురంతా బలవద్విరోధితా. 23

పదవిభాగము: ప్రలీన భూపాలం, అపి, స్థిరాయతి, ప్రశాసత్, ఆవారిధి, మండలం, భువః, సః, చింతయతి, ఏవ, భియః, త్వత్, ఏష్యతీః, అహో, దురంతా, బలవద్విరోధితా.

అన్వయము: ప్రలీనభూపాలం స్థిరాయతి భువః మండలం ఆవారిధి ప్రశాసత్ అపి సః త్వత్ ఏష్యతీః భియః చింతయతి ఏవ; అహో బలవద్విరోధితా దురంతా.

అర్థము: ప్రలీన = అణగిపోయిన; భూపాలం = రాజులు గలది; స్థిర = నిశ్చలమైన; ఆయతి = భవిష్యత్తుగలదియైన; భువః = భూమియొక్క; మండలం = మండలమును; ఆవారిధి = సముద్రతీర పర్యంతము; ప్రశాసత్ + అపి = శాసించుచున్నవాడయ్యు; సః = ఆ దుర్యోధనుడు; త్వత్ = నీ వలన; ఏష్యతీః = రానున్న; భియః = భయకారణములను; చింతయతి-ఏవ = చింతించుచునే యున్నాడు; అహో = ఔరా; బలవత్ = బలవంతుని తోడి; విరోధితా = వైరము; దురంతా = దురంతమైనదిగదా.

తాత్పర్యము : అణగిపోయిన రాజులుగలది, నిశ్చలమైన భవిష్యముగలది యైన భూమండలమును సముద్రతీర పర్యంతము శాసించుచున్న వాడయ్యు ఆ దుర్యోధనుడు నీవలన కలుగనున్న భయములనుగూర్చి యాలోచించుచునే యున్నాడు. ఔరా ! బలవంతులతోడి వైరము దురంతమైనదిగదా.

అలంకారము : అర్థాంతరన్యాసము.

వ్యాఖ్యానము : జానపదులు, పౌరులు, వీరభటులు, రాజన్యులు తన యనురక్తులై యుండగా దుర్యోధనుడు సార్వభౌముడై సముద్రపర్యంతమైన భూమండలమును ఎదురులేక పాలించుచుండియు ధర్మజునివలన భయమును శంకించుచునే యుండెను. తా నెంత అస్త్రబలమును, అంగ బలమును సంపాదించినను అవి పాండవుల ధర్మబలమునకు, దైవబలమునకు సాటిరావని దుర్యోధను డెఱుంగును.

తాను వర్ణించి చెప్పిన దుర్యోధన వైభవమును విని ధర్మరాజు రాజ్య పునః ప్రాప్తిని గుఱించి యనుత్సాహి కాకుండుటకై వనచరుడు దుర్యోధనుని హృద్గతమైన భయమునుగూర్చి ప్రసంగించెను. "చింతయత్యేవ" అని నొక్కి చెప్పినాడు. బలవద్విరోధిత దురంతముగదా యని లోకప్రసిద్ధమైన సత్యముచే తన మాటను సమర్థించుచున్నాడు.

దైవ ధర్మబలములుగల ధర్మజునివలన దుర్యోధనుడు ప్రమాదమును శంకించుచున్నాడు అను విశేష విషయము బలవంతునితోడి వైరము దురంతము గదా యను సామాన్యవిషయముచే సమర్థింపబడినది గనుక ఇది యర్థాంతర న్యాసాలంకారము.

శ్లో॥ కథాప్రసంగేన జనైరుదాహృతా
దనుస్మృతాఖండలసూను విక్రమః
తవాభిధానా ద్వ్యథతే నతాననః
సుదుస్సహా న్మంత్రపదాది వోరగః. 24

పదవిభాగము : కథా ప్రసంగేన, జనైః, ఉదాహృతాత్, అనుస్మృతాఖండల సూను విక్రమః, తవ, అభిధానాత్, వ్యథతే, నతాననః, సుదుస్సహాత్, మంత్రపదాత్, ఇవ, ఉరగః.

అన్వయము : కథాప్రసంగేన జనైః ఉదాహృతాత్ తవ అభిధానాత్-అనుస్మృతాఖండల సూను విక్రమః సః సుదుస్సహాత్ మంత్రపదాత్ ఉరగః ఇవ న తాననః ( సన్ ) వ్యథతే.

అర్థము : కథా = గోష్ఠులయొక్క; ప్రసంగేన = ప్రసంగముచేత; జనైః = జనులచే; ఉదాహృతాత్ = పేర్కొనబడిన; తవ = నీయొక్క; అభిధానాత్ = నామధేయము వలన; అనుస్మృత = స్మరింపబడిన; ఆఖండల = ఇంద్రునియొక్క; సూను = కుమారునియొక్క; విక్రమః = పరాక్రమము గలవాడై; సః = ఆ దుర్యోధనుడు; త-వ = తార్క్ష్యుని యొక్కయు, వాసుకి యొక్కయు; అభిధానాత్ = నామధేయములుకల; దుస్సహాత్ = సహింపశక్యము కాని; మంత్ర-పదాత్ = మంత్రశబ్దము వలన; అనుస్మృత = స్మరింపబడిన; ఆఖండల = ఇంద్రునియొక్క; సూను = తమ్ముడైన విష్ణువుయొక్క; వి = పక్షి అయిన గరుడునియొక్క; క్రమః = పాదక్షేపముగల; ఉరగః-ఇవ = పామువలె; నత + ఆననః-సన్ = వంచబడిన ముఖముకల వాడగుచు; వ్యథతే = దుఃఖపడు చున్నాడు.

తాత్పర్యము : కథా ప్రసంగ వశమున జనులచే పేర్కొనబడిన నీ నామ ధేయమువలన స్మరింపబడిన అర్జున పరాక్రమము గలవాడై ఆ దుర్యోధనుడు తార్క్ష్యునియొక్కయు, వాసుకియొక్కయు నామధేయములు కల దుస్సహమైన మంత్రశబ్దము వలన స్మరింపబడిన యింద్రానుజుడైన విష్ణుని పక్షియగు గరుడుని పాదక్షేపముగల ఉరగమువలె నతాననుడై దుఃఖపడుచున్నాడు.

అలంకారము : ఉపమ, శ్లేష.

వ్యాఖ్యానము : దుర్యోధను డెంత గూఢమైన ఆకారేంగితములు కలవాడైనను, ధర్మజాదుల ప్రసంగము వచ్చినప్పుడు మాత్రము తన హృదయ మందలి భయమును అణచిపెట్టుకొన జాలకున్నాడు. ప్రసంగ వశమున ధర్మజుని పేరు వినబడినంతనే ఆతనికి అర్జునుని పరాక్రమము గుర్తువచ్చును. వెంటనే ఆతడు అప్రయత్నముగా తలవంచుకొని వ్యథపడును. ఈ చేష్టావిశేషమును బట్టి వనచరుడు దుర్యోధనుని హృదయగతమైన భీతిని గ్రహించెను. ధర్మజుని పేరు విన్నంతనే దుర్యోధనునకు అర్జునుని పరాక్రమమే గుర్తువచ్చునుగాని భీముని భుజబలము గుర్తురాదు. భీముడనిన దుర్యోధనునకు లెక్కలేదు. విశేషించి యీ

కావ్యము కిరాతార్జునీయము కనుక దుర్యోధనుడు అర్జునుని ప్రతాపమునే స్మరించె ననుట ఉచితము.

ధర్మజుని నామము విన్నంతనే దుర్యోధనుడు మంత్రపదమువిన్న ఉరగము వలె తలవంచుకొని వ్యథపడును అనుటచే అలంకారము ఉపమ. "నామైకదేశే నామగ్రహణమ్" అను న్యాయమున 'త - వ' అను నక్షరములచే తార్క్ష్య వాసుకి నామములు గ్రహింపబడును. గరుడుడు నాగశత్రువు; వాసుకి నాగరాజు, వీరి పేరులు వినబడినంతనే పాములు భయమువలన, భక్తివలన తలయవంచు కొనును. ఇట్లు "తవాభిధానాత్" అను పదబంధమున రెండర్థములు లిమిడియున్నవి, "ఆఖండలసూను విక్రమః" అను పదబంధమునందును రెండర్థము లున్నవి. కనుక అలంకారము శ్లేష. ఈ శ్లేషాలంకారము ఉపమాలంకారమునకు అంగమగు చున్నది గనుక శ్లేషోపమల సంకరము.

ధర్మజుని పేరు విన్నంతనే దుర్యోధనుడు అర్జునుని విక్రమమునే స్మరించు ననుట వలన దుర్యోధనునకు ధర్మజుని ధర్మబలముకంటె, భీముని భుజబలముకంటె, అర్జునుని విక్రమమే యెక్కువ భయహేతు వగుచున్నదని భావము.

శ్లో॥ తదాశు కర్తుం త్వయి జిహ్మ ముద్యతే
విధీయతాం తత్ర విధేయ ముత్తరమ్
పరప్రణీతాని వచాంసి చిన్వతాం
ప్రవృత్తి సారాః ఖలు మాదృశాం గిరః. 25

పదవిభాగము : తత్, ఆశు, కర్తుం, త్వయి, జిహ్మం, ఉద్యతే, విధీయతాం, తత్ర, విధేయం, ఉత్తరం, పరప్రణీతాని, వచాంసి, చిన్వతాం, ప్రవృత్తిసారాః, ఖలు, మాదృశాం, గిరః.

అన్వయము : తత్ త్వయి జిహ్మం కర్తుం ఉద్యతే తత్ర విధేయం ఉత్తరం ఆశు విధీయతాం; పరప్రణీతాని వచాంసి చిన్వతాం మాదృశాం గిరః ప్రవృత్తిసారాః ఖలు.

అర్థము : తత్ = అందువలన; త్వయి = నీయందు; జిహ్మం = కపటమును; కర్తుం = చేయుటకు; ఉద్యతే = పూనిన; తత్ర = ఆతనియందు;

విధేయం = చేయదగిన; ఉత్తరం = ప్రతీకారము; ఆశు = శీఘ్రముగా; విధీయతాం = చేయబడుగాక; పరైః = ఇతరులచే; ప్రణీతాని = చెప్పబడిన; వచాంసి = వాక్యములను; చిన్వతాం = సంగ్రహించునట్టి; మాదృశాం = మావంటి వారియొక్క: గిరః = వాక్యములు; ప్రవృత్తి-సారాః-ఖలు = వార్తలు మాత్రమే సారముగా గలవికదా.

తాత్పర్యము : అందువల్ల నీయందు కపటము నాచరించుటకు పూనిన ఆ దుర్యోధనునియందు చేయదగిన ప్రతీకారము శీఘ్రముగా జేయబడునుగాక ! పరులచే బలుకబడిన మాటలను సంగ్రహించు మావంటివారి వచనములు కేవలము వార్తాప్రధానములే యగునుగదా.

అలంకారము : అర్థాంతరన్యాసము.

వ్యాఖ్యానము : దుర్యోధనుడు ప్రజారంజకుడై అంగబలమును అర్థ బలమును వృద్ధిచేసికొను చున్నాడు గనుక అట్టివానిని జయించి రాజ్యభాగమును సంపాదించుకొను టెట్లా యని ధర్మజుడు చింతింప నక్కరలేదు. ధర్మజుని పేరు వినబడినంతనే దుర్యోధనుని యందు భీతి యుప్పతిల్లుచున్నది. కనుక ధర్మరాజు నిరుత్సాహ పడనక్కరలేదు. తనపట్ల కపటము ప్రయోగింప జూచుచున్న దుర్యోధనుని పరాభూతుని గావించుటకు వలసిన ప్రయత్నములు ధర్మజుడు శీఘ్రముగా అనుష్ఠింప వలసి యున్నది. ఇది గూఢచారిగా వనచరుడు వ్యక్త పరచిన యభిప్రాయము. తాను చూచినది, విన్నది చెప్పుటయే చారకృత్యముగాని ప్రభువునకు ఉపాయములు ఉపదేశించుట చారుని ధర్మముకాదు. కనుకనే వాడు ఉపదేశము చేయలేదు. అట్లు చేయకుండుటను మావంటివారి మాటలు కేవలము వార్తాప్రధానములే కదాయని యర్థాంతరముచే సమర్థించుకొను చున్నాడు కనుక నిది యర్థాంతరన్యాసము.

వనచరుడు చారకృత్యమున నారితేరిన వాడేకాని ధర్మనీతి శాస్త్రములందు నిపుణుడు కాడు. కనుక ప్రతీకార ప్రయత్నము చేయవలయును అని సూచన మాత్రము చేసి వాడు తన ప్రసంగమును విరమించెను.

శ్లో॥ ఇతీరయిత్వా గిర మాత్తసత్క్రియే
గతేఽథ పత్యౌ వనసంనివాసినామ్
ప్రవిశ్య కృష్ణా సదనం మహీభుజా
తదాచచక్షే ఽనుజసన్నిధౌ వచః. 26

పదవిభాగము : ఇతి, ఈరయిత్వా, గిరం, ఆత్త సత్క్రియే, గతే, అథ, పత్యౌ, వనసంనివాసినాం, ప్రవిశ్య, కృష్ణా సదనం, మహీభుజా, తత్, ఆచచక్షే, అనుజసన్నిధౌ, వచః.

అన్వయము : వనసంనివాసినాం పత్యౌ ఇతి గిరం ఈరయిత్వా ఆత్త సత్క్రియే గతే (సతి) అథ మహీభుజా కృష్ణాసదనం ప్రవిశ్య అనుజసన్నిధౌ తత్ వచః ఆచచక్షే.

అర్థము : వనసంనివాసినాం = ఆటవికులయొక్క; పత్యౌ = నాయకుడు; ఇతి = ఈ విధముగా; గిరం = వాక్యమును; ఈరయిత్వా = పలికి ; ఆత్త-సత్క్రియే = పొందబడిన సత్కారముగలవాడై; గతే (సతి) = వెడలి పోయినవాడు కాగా; అథ = అనంతరము; మహీభుజా = ధర్మరాజుచేత; కృష్ణా-సదనం = ద్రౌపది మందిరమును; ప్రవిశ్య = ప్రవేశించి; అనుజ = తమ్ములు; సన్నిధౌ = సమక్షమందు; తత్ = కిరాతుడు చెప్పిన ఆ వచనము; ఆచచక్షే = చెప్పబడెను.

తాత్పర్యము : కిరాతనాయకుడు ఈవిధముగా వాక్యము పలికి పొందబడిన సత్కారము గలవాడై వెడలిపోగా అనంతరము ధర్మరాజు ద్రౌపదీ భవనము ప్రవేశించి తమ్ముల సమక్షమున ఆ వనచరుడు చెప్పిన మాటను చెప్పెను.

వ్యాఖ్యానము : వనచరుడు తెలిపిన యంశములు చాల ప్రయోజనకరములైనవి. దుర్యోధనుడు బలపడుచున్నాడనియు, ఐనను భయపడుచునే యున్నాడనియు చెప్పిన చారుని మాటలు ధర్మజుడు ప్రతీకార ప్రయత్నము చేయవలయుననియు, మిక్కిలి శీఘ్రముగా, శక్తిమంతముగా చేయవలసి యున్నదనియు ధర్మజునకు కర్తవ్యమును వ్యక్తము చేయుచున్నవి. కనుక ధర్మజు డాతనిని సత్కరించి పంపివైచి వెంటనే ద్రౌపది సదనమునకు బోయెను. అచ్చటికి తమ్ములను రప్పించెను. అందరు వినుచుండగా చారుడు తెచ్చిన

వార్తను వినిపించెను. చారుని వార్త యెంతముఖ్యమైనదో దీనివల్ల స్పష్టపడు చున్నది. ఆ ప్రాముఖ్యమే ద్రౌపదీ భీమసేనుల యుపన్యాసములకు గారణ మైనది. ప్రతీకార ప్రయత్నము వెంటనే చేయవలెనన్న చారుని యభిప్రాయమునే ద్రౌపదీ భీమసేనులు సోపపత్తికముగా నొక్కి వక్కాణించిరి.

శ్లో॥ నిశమ్య సిద్ధిం ద్విషదా మపాకృతీ
స్తత స్తతస్త్యా వినియంతు మక్షమా
నృపస్య మన్యు వ్యవసాయ దీపినీ
రుదాజహార ద్రుపదాత్మజా గిరః. 27

పద విభాగము : నిశమ్య, సిద్ధిం, ద్విషదాం, అపాకృతీః, తతః, తతస్త్యాః, వినియంతుం, అక్షమా, నృపస్య, మన్యువ్యవసాయదీపినీః, ఉదాజహార, ద్రుపదాత్మజా, గిరః.

అన్వయము : ద్రుపదాత్మజా ద్విషదాం సిద్ధిం నిశమ్య తతః తతస్త్యాః అపాకృతీః వినియంతుం అక్షమా (సతీ) నృపస్య మన్యువ్యవసాయ దీపినీః గిరః ఉదాజహార.

అర్థము : ద్రుపదాత్మజా = ద్రౌపది; ద్విషదాం = శత్రువులయొక్క; సిద్ధిం = అభివృద్ధిని; నిశమ్య = విని; తతః = అనంతరము; తతస్త్యాః = వారి వలన గలిగిన; అపాకృతీః = అపకారములను; వినియంతుం = నిరోధించుటకు; అక్షమా (సతీ) = అశక్తురాలయి; నృపస్య = ధర్మరాజుయొక్క; మన్యు = క్రోధముయొక్కయు; వ్యవసాయ = ప్రయత్నముయొక్కయు; దీపినీం = సందీపకమైన; గిరః = వాక్కులను; ఉదాజహార = పలికెను.

తాత్పర్యము : శత్రువులయొక్క యభివృద్ధిని గుఱించి విని వారి వలన గలిగిన యపకారములను నిరోధించుటకు అశక్తురాలై యా ద్రౌపది ధర్మరాజు యొక్క క్రోధమును, ప్రయత్నమును ఉద్దీపింపజేయు వాక్కులను పలికెను.



వ్యాఖ్యానము : కౌరవుల వలన సర్వ విధములైన యవమానములను అనుభవించినది ద్రౌపది. ధర్మజుడు అనువదించినచారవాక్యములు విని ముందుగా ఉపన్యసింప మొదలిడినది ఆమెయే. కౌరవుల అభివృద్ధిని విని, వారి వలన తనకు

గలిగిన యవమానములను స్మరించి ద్రౌపది క్రోధము ఉద్దీపితమైనది. ప్రశాంతముగా సమయావసానము కొఱకు వేచియున్న ధర్మజుని క్రోధమును దీపింపజేయ నారదుడు సూచించినట్లు ఆయనచే వెంటనే ప్రతీకార ప్రయత్నము చేయించవలెనని ద్రౌపది క్రోధసందీపకములైన వాక్యములు పలుక నారంభించెను.

శ్లో॥ భవాదృశేషు ప్రమదా జనోదితం
భవత్యధిక్షేప ఇవానుశాసనమ్
తథాపి వక్తుం వ్యవసాయయంతి మాం
నిరస్తనారీ సమయా దురాధయః. 28

పదవిభాగము : భవాదృశేషు, ప్రమదాజనోదితం, భవతి, అధిక్షేపః, ఇవ, అనుశాసనం, తథాపి, వక్తుం, వ్యవసాయయంతి, మాం, నిరస్తనారీ సమయాః, దురాధయః.

అన్వయము : భవాదృశేషు ప్రమదాజనోదితం అనుశాసనం అధిక్షేపః ఇవ భవతి; తథాపి నిరస్తనారీ సమయాః దురాధయం మాం వక్తుం వ్యవసాయయంతి.

అర్థము : భవాదృశేషు = నీవంటివారియందు; ప్రమదాజన = స్త్రీ జనముచే; ఉదితం = పలుకబడిన; అనుశాసనం = ఉపదేశవాక్యము; అధిక్షేపః + ఇవ = తిరస్కారమువలె; భవతి = అగును; తథాపి = ఐనప్పటికిని; నిరస్త = తిరస్కరింపబడిన; నారీ = స్త్రీలయొక్క; సమయాః = ఆచారములుగల; దురాధయః = దుష్టములైన మానసిక వ్యథలు; మాం = నన్ను; వక్తుం = పలుకుటకు; వ్యవసాయయంతి = ప్రేరేపించుచున్నవి.

తాత్పర్యము : నీవంటివారిపట్ల స్త్రీ జనముచే పలుకబడిన యాజ్ఞారూపము లయిన వాక్యములు తిరస్కారములవలె కనబడును. అయినప్పటికిని తొలగ ద్రోయబడిన స్త్రీ జనోచితాచారములుగల మానసికవ్యథలు నన్ను మాటాడుటకు ప్రేరేపించుచున్నవి.

వ్యాఖ్యానము : "ప్రవిశ్య కృష్ణాసదసం మహీభుజా తదాచచక్షేఽనుజ సన్నిధౌ వచః" అను 26వ శ్లోకమందలివాక్యమునుండి "మహీభుజా కృష్ణా ఆచ

చక్షే" ధర్మరాజుచేత ద్రౌపది చెప్పబడెను అని ధర్మరాజు తమ్ముల సమక్షమున చారవాక్యమును ద్రౌపదిని ఉద్దేశించి చెప్పెను అన్న యర్థస్ఫురణ ముండుటచే ద్రౌపదియే తొలుత మాట్లాడ నారంభించెను. ధర్మజునివంటి నీతి విశారదునకు ఒక స్త్రీ రాజనీతి విషయమున ఉపదేశింపబూనుట అసమంజసము. అది తిరస్కారముగా గూడ తోచవచ్చును. కనుక ద్రౌపది తాను నీతి బోధించుటకు అర్హతగలది కాకపోయినను అవమానములవల్ల గలిగిన దుష్టములైన మనోవ్యాధులవలన ప్రేరేచబడి మాట్లాడ బూనుకొన్నట్లు క్షమార్పణ పూర్వకముగా ఉపక్రమించుచున్నది. పరాభవ దుఃఖావేశమునకు వశయై తాను పలుకుటయందు గాని, పలుకబోవుమాటలందుగాని అనౌచిత్యమున్నచో ధర్మజుడు క్షమింపవలెనని ద్రౌపది కోరిక.

అనుశాసనము అధిక్షేపమువంటిది అగును అనుటవల్ల నిజముగా అధిక్షేపము కాదనియు, అట్లు తోచునది మాత్రమే యని కనుక క్షమార్హమని ద్రౌపది ఆశయము.

శ్లో॥ అఖండ మాఖండల తుల్యధామభి
శ్చిరం ధృతా భూపతిభిః స్వవంశజైః
త్వయాత్మ హస్తేన మహీ మదచ్యుతా
మతంగజేన స్రగివాప వర్జితా. 29

పదవిభాగము : అఖండం, ఆఖండల తుల్యధామభిః, చిరం, ధృతా, భూపతిభిః, స్వవంశజైః, త్వయా, ఆత్మహస్తేన, మహీ, మదచ్యుతా, మతంగజేన, స్రక్, ఇవ, అపవర్జితా.

అన్వయము : ఆఖండల తుల్యధామభిః స్వవంశజైః భూపతిభిః, చిరం అఖండం ధృతామహీత్వయా మదచ్యుతా మతంగజేన స్రక్ ఇవ ఆత్మహస్తేన త్రస్తా.

అర్థము : ఆఖండల = దేవేంద్రునితో; తుల్య = సమానమైన; ధామభిః = ప్రభావముగల; స్వ = నీయొక్క; వంశజైః = వంశమందుబుట్టిన; భూపతిభిః = రాజులచేత; చిరః = చిరకాలము; అఖండం = అవిచ్ఛిన్నముగా;

ధృతా = ధరింపబడిన; మహీ = భూమి; త్వయా = నీచేత; మదచ్యుతా = మదము స్రవించుచున్న; మతంగజేన = ఏనుగుచేత; స్రక్ + ఇవ = పూలదండవలె; ఆత్మ = నీయొక్క; హస్తేన = చేతిచే; అపవర్జితా = విడిచిపెట్టబడినది.

తాత్పర్యము : దేవేంద్రునితో సమానమైన ప్రభావముగల నీ వంశజులైన రాజులచే చిరకాలము అవిచ్ఛిన్నముగా ధరింపబడిన భూమి మదము స్రవించుచున్న ఏనుగుచేత పూలదండవలె నీ చేతిచే విసరివేయబడినది.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : భరతాది పూర్వచక్రవర్తులచే అవిచ్ఛిన్నముగా ధరింపబడిన భూమి ధర్మజునిచే అకారణముగా విసరివేయబడినది. ఇది మదగజముచే పూలమాల నిర్లక్ష్యముగా విసరివేయబడుటతో పోల్చబడినది. కనుక ఉపమాలంకారము. పూలమాలను విసరివేయుటకుగాని, మరల స్వీకరించుటకుగాని మదగజము సమర్థమే. అట్లే ధర్మజుడును అకారణముగా వదలిపెట్టిన రాజ్యమును తిరిగి తీసికొనుటకు సమర్థుడు. కనుక అట్టి ప్రయత్నము చేయవలెనని ద్రౌపది యభిప్రాయము. "ఆత్మహస్తేన" అనగా చేతితో, తొండముతో అని అర్థద్వయము. ధర్మజుడు పాచికలాడి రాజ్యము కోల్పోవుటచే ఆయన రాజ్యమును చేతితో విసరివైచినట్లే.

నీవు మదగజము వంటివాడవు. సర్వసమర్థుడవు. రాజ్యమును నిష్కారణముగా వదలిపెట్టితివి అని నింద. కోరినచో మరల దానిని స్వీకరించుటకు సమర్థుడవు అని స్తుతి. ఇట్లు నిందాస్తుతిచే ధర్మజుని ద్రౌపది రాజ్య స్వీకారమునకు ప్రోత్సహించుచున్నది. నీ దోషమువల్లనే రాజ్యము పోయినది. కుటిలులైన కౌరవులపట్ల కౌటిల్యము వహింపకుండుటే నీ దోషము. కనుక ఇప్పటికైనను ఆ దోషమును వీడుము అని ద్రౌపది సూచన.

శ్లో॥ వ్రజంతి తే మూఢధియః పరాభవం
భవంతి మాయావిషు యే న మాయినః
ప్రవిశ్య హి ఘ్నంతి శఠా స్తథా విధా
నసంవృతాంగా న్నిశితా ఇవేషవః. 30

పదవిభాగము : వ్రజంతి, తే, మూఢధియః, పరాభవం, భవంతి, మాయా విషు, యే, న, మాయినః, ప్రవిశ్య, హి, ఘ్నంతి, శఠాః, తథావిధాన్, అసం వృతాంగాన్, నిశితాః, ఇవ, ఇషవః.

అన్వయము : యే మాయావిషు మాయినః న భవంతి తే మూఢధియః పరాభవం వ్రజంతి; శఠాః తథావిధాన్ అసంవృతాంగాన్ నిశితాః ఇషవః ఇవ ప్రవిశ్య ఘ్నంతి హి.

అర్థము : యే = ఎవ్వరు; మాయావిషు = కపటముగలవారియందు; మాయినః = కపటముగలవారు; న-భవంతి = కారో; తే = ఆ; మూఢ-ధియః = మందబుద్ధులు; పరాభవం = అవమానమును; వ్రజంతి = పొందుచున్నారు; శఠాః = ధూర్తులు; తథా-విధాన్ = అట్టి మాయలేనివారిని; అసంవృత = కవచాదులచే కప్పబడని; అంగాన్ = శరీరములుగలవారిని; నిశితాః = పదునైన; ఇషవః + ఇవ = బాణములువలె; ప్రవిశ్య = ప్రవేశించి; ఘ్నంతి = హింసించు చున్నారుకదా.

తాత్పర్యము : ఎవ్వరు మాయావుల విషయమున మాయావులు కారో ఆ మందబుద్ధులు పరాభవము పొందుదురు. ధూర్తులు అట్టి యమాయికులను కవచాదులచే కప్పబడని యంగములు గలవారిని వాడియైన బాణములువలె చొచ్చి హింసింతురుగదా.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : మాయావులపట్ల మాయ ప్రయోగింపని వారు మూఢులు. అట్టివారు మాయావులచే పరాభవము పొందుదురు. కవచము ధరింపని వారి శరీర ములను నిశితాశుగములు ప్రవేశించి సంహరించినట్లు కుటిల ప్రవర్తనులు అమా యికులను ప్రవేశించి నాశమొనర్తురు అనుటవల్ల ఉపమాలంకారము.

కుటిల వర్తనులపట్ల కౌటిల్యము ప్రయోగింపకుండుట నీతికాదు అని ద్రౌపది యాశయము. ఈ వాక్యములను ద్రౌపది కాంతాసమ్మితముగా చెప్పు చున్నది. లోకసామాన్యముగా చెప్పబడిన ఈ వాక్యమందలి మూఢబుద్ధి ధర్మ జుడే. లోకదృష్టిలో ఇంతే. అసత్యమును అసత్యముతో, అధర్మమును అధర్మ ముతో ఎదుర్కొనుట లోకసామాన్యమైన నీతి. ద్రౌపది ఈ నీతినే చెప్పుచున్నది.

నీతిని, ధర్మమును ఆరాధించు ధర్మజుడు ఈ నీతిని అంగీకరింపడు. పరోక్షముగ నైనను ధర్మజుని 'మూఢధీ' యనుట ద్రౌపదికి తగదుకాని దుఃఖాతిరేకమున పలుకుచున్నది గనుక ఈ పారుష్యము క్షంతవ్యము.

ఈ శ్లోకార్థమంతయు అప్రస్తుత ప్రశంస. ప్రస్తుతార్థమును భంగ్యంతరమున చెప్పునట్టిది.

శ్లో॥ గుణానురక్తా మనురక్త సాధనః
కులాభిమానీ కులజాం నరాధిపః
పరైస్త్వదన్యః క ఇవాపహారయే
న్మనోరమా మాత్మవధూ మివ శ్రియమ్. 31

పదవిభాగము : గుణానురక్తాం, అనురక్తసాధనః, కులాభిమానీ, కులజాం, నరాధిపః, పరైః, త్వదన్యః, కః, ఇవ, అపహారయేత్, మనోరమాం, ఆత్మవధూం, ఇవ, శ్రియం.

అన్వయము : అనురక్తసాధనః కులాభిమానీ త్వదన్యః కః ఇవ నరాధిపః గుణానురక్తాం కులజాం మనోరమాం ఆత్మవధూం ఇవ శ్రియం పరైః అపహారయేత్.

అర్థము : అనురక్త సాధనః = అనుకూలమైన సహాయ సంపత్తిగలవాడు; కులాభిమానీ = వంశమందభిమానముగలవాడు; త్వత్ + అన్యః = నీకంటె వేఱయినవాడు; కః + ఇవ = ఎట్టివాడైన; నరాధిపః = రాజు; గుణ = గుణములచే; అనురక్తాం = అనురక్తురాలును; కులజాం = సత్కులమున బుట్టినదియు; మనోరమాం = మనోహరమునైన; ఆత్మ-వధూం + ఇవ = తన భార్యనువలె; గుణ = గుణములచేత; అనురక్తాం = అనురక్తయు; కులజాం = కులక్రమాగతయు; మనోరమాం = మనోహరయునైన; శ్రియం = సంపదను; పరైః = శత్రువులచేత; అపహారయేత్ = అపహరింపజేయును.

తాత్పర్యము : అనుకూలమైన సహాయసంపత్తి గలిగి కులాభిమానము గలవాడు నీకంటె ఇతరుడైన ఎట్టి ప్రభువు సౌందర్యాది గుణములచే అనురక్తయు, సద్వంశమున బుట్టినదియు, మనోరమయునైన తన భార్యనువలె

సంధ్యాది గుణములచే అనుకూలయు, కులక్రమాగతయు, సునోహరయునైన రాజ్యలక్ష్మిని శత్రువులచే అపహరింపజేయును ?

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : ధర్మరాజు ఉత్తమ క్షత్రియుడు, చంద్రవంశ్యుడు. ఆయన తమ్ములు ఆయనయందనురక్తులు, సర్వసమర్థులు అయినను ఆయన తనలక్ష్మిని. భార్యను, పరాభవము పాలుచేసెను. ఆ రాజ్యలక్ష్మి కులజ అనగా వంశ పరంపరగా తనకు లభించినది. ఆ భార్యకులజ అనగా ఉత్తమ క్షత్రియ వంశమున జన్మించినది. రాజ్యలక్ష్మి, భార్య ఇరువురు ఆయన గుణములందనురక్తిగలవారే. ఆయనయే ఆ యిరువురను శత్రువు లవమానించుచుండ చూచి యూరకుండెను. అట్లు స్వరాజ్యమును, స్వభార్యను పరులచే అపహరింపజేసినవాడు ఆయనతప్ప ఎవ్వడును లేడు. ద్యూతప్రవృత్తుడై ధర్మజుడు రాజ్యమునకు, స్వభార్యకు తీవ్రమైన హాని కలిగించెను. కులాభిమానికి ఇంతకంటె అపమానమేముండును ?

"ఉద్యోగాదనివృత్తస్య సుసహాయస్య ధీమతః
ఛాయేవానుగతా తస్య నిత్యం శ్రీస్సహచారిణీ"

అను కామందక వాక్యమునుబట్టి ధర్మరాజు ఉద్యోగము చేసినచో లక్ష్మి యాతనికి ఛాయవలె సహచారిణియై యుండెడిది. కుటిలుల పట్ల కౌటిల్యము ప్రయోగించుటే ఆయన చేయవలసిన ఉద్యోగము. ఆత్మవధువును వలె లక్ష్మిని ఎవ్వడు అపహరింపజేయును అనుపట్ల ఉపమాలంకారము. ధర్మజుడు ఆత్మవధువును, లక్ష్మిని గూడ అపహరింపజేయుటచే ఈ యలంకారము సార్థకము. ఇవ శబ్దమునకు సహార్థము చెప్పికొన్నచో సహోక్త్యలంకారము స్ఫురించును.

శ్లో॥ భవంత మేతర్హి మనస్విగర్హితే
వివర్తమానం నరదేవ వర్త్మని
కథం న మన్యుర్జ్వలయత్యుదీరితః
శమీ తరుం శుష్క మివాగ్ని రుచ్ఛిఖః. 32

పదవిభాగము : భవంతం, ఏతర్హి, మనస్విగర్హితే, వివర్తమానం, నరదేవ, వర్త్మని, కథం, న, మన్యుః, జ్వలయతి, ఉదీరితః, శమీతరుం, శుష్కం, ఇవ, అగ్నిః, ఉచ్ఛిఖః,

అన్వయము : హే నరదేవ! ఏతర్హి మనస్విగర్హితే వర్త్మని వివర్తమానం భవంతం ఉదీరితః మన్యుః శుష్కం శమీతరుం ఉచ్ఛిఖః అగ్నిః ఇవ కథం న జ్వలయతి ?

అర్థము : హే నరదేవ = ఓ ధర్మరాజా; ఏతర్హి = ఇప్పటికిని; మనస్వి = అభిమానవంతులచే; గర్హితే = నిందింపబడిన; వర్త్మని = మార్గమునందు; వివర్తమానం = వర్తించుచున్న; భవంతం = నిన్ను; ఉదీరితః = ఉద్దీపితమైన; మన్యుః = క్రోధము; శుష్కం = ఎండిన; శమీ-తరుం = జమ్మిచెట్టును; ఉచ్ఛిఖః = వెడలుచున్నశిఖలుగల; అగ్నిః + ఇవ = అగ్నివలె; కథం = ఎట్లు; న-జ్వలయతి = మండజేయుటలేదు.

తాత్పర్యము : ఓ రాజా ! ఇప్పటికిని మానధనులచే గర్హింపబడిన మార్గమున వర్తించుచున్న నిన్ను ఉద్దీపితమైన క్రోధము ఎండిన జమ్మిచెట్టును మంటలు రేగిన యగ్నివలె ఎట్లు మండజేయుటలేదు ?

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : ద్రౌపది యభిమానవతి. ధర్మజుడును అభిమానవంతుడే. కాని ఉభయుల యభిమానత్వమున భేదము కలదు. ద్రౌపది యభిమానము రాజసము, ధర్మజునిది సాత్వికము. సంయమముగల ధర్మజుడు శాంతముగా సమయకాలము ముగియు వరకు వేచియుండగోరును. ఉద్రిక్తయగు ద్రౌపది సమయభంగము చేసియైనను ప్రతీకారము గావింపవలె ననును. ధర్మజుని యందు క్రోధము లేకపోలేదు, కాని అది ద్రౌపది యందలి క్రోధమువలె ప్రజ్వలించదు. ధర్మజు డవలంబించుచున్న శాంతిమార్గము మనస్విగర్హితమనగా ద్రౌపదీ భీముల వంటి తీవ్రవాదులు గర్హించునది యని యర్థము క్రోధాగ్ని ద్రౌపదీ భీములను దహించుచున్నది. ధర్మజుని దహించుటలేదని ద్రౌపది యభిప్రాయము. శాంతుని క్రోధము పైకి కనబడదు. శుష్కమైన జమ్మచెట్టును అగ్నివలె నిన్ను క్రోధము ఏల దహించుటలేదు అనుపట్ల ఉపమాలంకారము. పవిత్రుడైన ధర్మజుని శమీవృక్షముతో పోల్చుట ఉచితముగా నున్నది. శమీవృక్షము అగ్ని గర్భము గనుక క్రోధ గర్భుడైన వ్యక్తిని శమీవృక్షముతోపోల్చుట సమంజసము. శుష్క శమీవృక్షమును అగ్ని శీఘ్రముగా దహించును. ధర్మజుడు దయార్ద్రహృదయుడు గనుక ఆర్ద్ర శమీవృక్షమువంటివాడు. కనుక అంతర్గత క్రోధము ఆయనను దహింపదు.

నిన్నేల వహింపుటలేదు అని భార్య భర్త నుద్దేశించి పలుకుట అనుచిత మగును. కాని తాను క్రోధాగ్ని దగ్ధయగుచున్న ద్రౌపది దుఃఖావేశమున పలికిన దగుటచే క్షంతవ్యము. నన్నయ భీమునిచే 'భవద్బాహుదాహంబు సేయవలయు' నని ధర్మజుని గూర్చి పలికించెను. తిక్కన ద్రౌపదిచే "కట్టివిక్రయంబు శాల్పనే" అనిపించెను. క్రోధోద్రేకమున పలుకబడిన యీ మాటలు తత్కాల మున స్వాభావికములగుటయే వాని యౌచిత్యము.

శ్లో॥ అవంధ్య కోపస్య నిహంతు రాపదాం
భవంతి వశ్యాః స్వయమేవ దేహినః
అమర్ష శూన్యేన జనస్య జంతునా
న జాతహార్దేన న విద్విషాదరః 33

పదవిభాగము : అవంధ్య కోపస్య, నిహంతుః, ఆపదాం, భవంతి, వశ్యాః, స్వయం, ఏవ, దేహినః, అమర్షశూన్యేన, జనస్య, జంతునా, న, జాతహార్దేన, న, విద్విషాదరః.

అన్వయము : అవంధ్య కోపస్య ఆపదాం నిహంతుః దేహినః స్వయమేవ వశ్యాః భవంతి; అమర్షశూన్యేన జంతునా జాతహార్దేన (సతా) జనస్య ఆదరః న; విద్విషా చ (సతా) దరః న.

అర్థము: అవంధ్య = వ్యర్థముకాని; కోపస్య = కోపముగలిగి; ఆపదాం = ఆపదలకు; నిహంతుః = నాశకుడైన వానికి; దేహినః = జనులు; స్వయం + ఏవ = తమంత తామే; వశ్యాః = వశంగతులు; భవంతి = అగుదురు; అమర్ష శూన్యేన = కోపము లేనటువంటి; జంతునా = మనిషి; జాత - హార్దేన(సతా) = కలిగినస్నేహము గలవాడైనను; ఆదరః-న = ప్రీతిలేదు; విద్విషా-(సతా)చ = శత్రువైనను; దరః-న = భయములేదు.

తాత్పర్యము : వ్యర్థముకాని కోపముగలిగి యాపదలను నాశము చేయ గలవానికి జనులు తమంతతామే వశవర్తులగుదురు. క్రోధరహితుడైన మానవుడు స్నేహముగలవాడైనను ప్రీతి కలుగదు; శత్రువైనను భయము కలుగదు.

అలంకారము : శ్లేష.

వ్యాఖ్యానము : తిరుగులేని కోపముగలవాడై యాపదలను తొలగింపగల వ్యక్తికి లోకము వశమగును. అనగా నిగ్రహించుటకు, అనుగ్రహించుటకు సమర్థుడైనవానికి లోకము వశమగును. ధర్మరాజు కోపము విడిచినందున ఆయన నిగ్రహ సమర్థుడుకాదు. కోపముచేతనే శత్రువును సాధించి పాండవుల యాపదలు తొలగింప శక్యమగును గాన అట్టి కోపములేని ధర్మరాజు అనుగ్రహ సమర్థుడును కాడు. క్రోధశూన్యమైన జంతువుయొక్క మైత్రిపట్లను, శాత్రవము పట్లను లోకమునకు లక్ష్యము ఉండదు. మిత్రమన్న ఆదరము ఉండదు. శత్రువన్న దరము (భయము) ఉండదు. యథాస్థానమున కోపమునకు పట్టు విడుపులు గలవాడే లోకుల గౌరవమునకు పాత్రుడగును అని ద్రౌపది యాశయము. కాని పాండవులు, ద్రౌపది ధర్మజునకు వశులే అయి యున్నారు. నిజముగా ఆయన యవంధ్యకోపుడు. ఆయనకు ఒక పట్టున కోపమురాదు. వచ్చినచో దానికి తిరుగు లేదు. అనగా ఎప్పుడు కోపము రావలెనో అప్పుడే ఆయనకు కోపము వచ్చును. సమయపాలన కాలము కోపమునకు అదనుకాదని ధర్మజు డెఱుంగును గనుకనే ద్రౌపదీ భీమసేనులవలె ఆయన కోపము వహింపలేదు. ధర్మజుడు యుధిష్ఠిరుడనుట గమనింపవలెను. ఆయన యుద్ధమునకు దిగడు. దిగినచో తుదముట్టికాని మరలడు. అవమాన దుఃఖముచే సహనము కోల్పోయిన ద్రౌపది ధర్మరాజును సమయభంగముగావించి కోపము వహించి శత్రుసంహారము చేయుమని సామాన్య రాజనీతి ననుసరించి యుద్బోధించుచున్నది.

'విద్విషాదరః' అన్న పదము విద్విషా + ఆదరః, విద్విషా + దరః అను తీరున భిన్నముగా ఖండింపబడి భిన్నార్థములు కలిగించుచున్నది గనుక శ్లేషాలంకారము.

శ్లో॥ పరిభ్రమన్ లోహిత చందనోచితః
పదాతి రంతర్గిరి రేణురూషితః
మహారథః సత్యధనస్య మానసం
దునోతి నో కచ్చిదయం వృకోదరః 34

పదవిభాగము : పరిభ్రమన్, లోహిత చందనోచితః, పదాతిః, అంతర్గిరి, రేణురూషితః, మహారథః, సత్యధనస్య, మానసం, దునోతి, నో, కచ్చిత్, అయం, వృకోదరః.

అన్వయము : (ప్రాక్) లోహిత చందనోచితః మహారథః అయం వృకోదరః (సంప్రతి) రేణురూషితః పదాతిః అంతర్గిరి పరిభ్రమన్ సత్యధనస్య (తే) మానసం నో దునోతి కచ్చిత్ ?

అర్థము :- (ప్రాక్ = పూర్వము); లోహిత = ఎఱ్ఱని; చందన = గంధమునకు; ఉచితః = అలవాటుపడినవాడు; మహారథః = మహారథుడును నైన; అయం = ఈ; వృకోదరః = భీమసేనుడు; (సంప్రతి = ఇప్పుడు); రేణు = ధూళిచే; రూషితః = కప్పబడినవాడు; పదాతిః = పాదచారియునై; అంతర్గిరి = పర్వతముల నడుమ; పరిభ్రమన్ = సంచరించుచు; సత్య-ధనస్య = సత్యమే ధనముగాగల; (తే = నీయొక్క); మానసం = మనస్సును; నో - దునోతి- కచ్చిత్ = పరితపింపజేయుటలేదా ?

తాత్పర్యము : పూర్వము రక్త చందనమునకు అలవాటు పడిన మహారథుడైన ఈ భీమసేనుడు ఇప్పుడు ధూళి ధూసరితుడై పాదచారియై పర్వతముల నడుమ దిరుగుచుండగా సత్యధనుడవైన నీ మనస్సు పరితాపము చెందుటలేదా ?

వ్యాఖ్యానము : మహావీరుడైన భీముడు శరీరమున రక్త చందనము పూసికొనుట కలవాటుపడియున్నాడు. మహారథుడైన ఆతడు కాలినడకకు అలవడినవాడు కాడు. ఇప్పుడు మాత్రము ఆ భీముడు ఎఱ్ఱని ధూళికప్పిన శరీరముతో పాదచారియై కొండల నడుమ తిరుగుచున్నాడు. అది చూచి నీ మనస్సు దుఃఖపడుటలేదా ? తమ్ములకంటె నీకు సత్యమే ప్రియతరమా ? యని ద్రౌపది భీమాదులు అనుభవించుచున్న దీనావస్థను వర్ణించుచున్నది. 'సత్యధనస్య' అని ధర్మజుని అధిక్షేపించుచున్నది. శత్రువులు కపటమున నిన్ను గెల్చిరి. అడవికి పంపిరి. వంచనకు గురియై ఇందరకు ఇన్ని బాధలు కలిగించుచు సత్యమును ధనముగా కాపాడుకొనుచుంటివా ? వంచకుల పట్ల సత్యమేమిటి ? అని ద్రౌపది యుద్బోధ. మా కంటె నీకు సత్యమే ఎక్కువ ప్రియమా యని యధిక్షేపము.

శ్లో॥ విజిత్య యః ప్రాజ్య మయచ్ఛ దుత్తరాన్
కురూ నకుప్యం వసు వాసమోపమః
స వల్కవాసాంసి తవాధునా హరన్
కరోతి మన్యుం న కథం ధనంజయః ?

పదవిభాగము : విజిత్య, యః, ప్రాజ్యం, అయచ్ఛత్, ఉత్తరాన్; కురూన్, అకుప్యం, వసు, వాసవోపమః, సః, వల్కవాసాంసి, తవ, అధునా, ఆహరన్, కరోతి, మన్యుం, న, కథం, ధనంజయః?

అన్వయము : వాసవోపమః యః ఉత్తరాన్ కురూన్ విజిత్య ప్రాజ్యం అకుప్యం వసు అయచ్ఛత్ సః ధనంజయః అధునా తవ వల్క వాసాంసి ఆహరన్ (తవ) మన్యుం కథం న కరోతి ?

అర్థము : వాసవ + ఉపమః = దేవేంద్రుడే ఉపమానముగా గల; యః = ఎవ్వడు; ఉత్తరాన్ = ఉత్తరములైన; కురూన్ = కురుదేశములను; విజిత్య = జయించి; ప్రాజ్యం = అధికమైన; అకుప్యం = వెండి బంగారురూపమైన;వసు = ధనమును; అయచ్ఛత్ = ఇచ్చెనో; సః = ఆ; ధనంజయః = అర్జునుడు; అధునా = ఇప్పుడు; తవ = నీకు; వల్క-వాసాంసి = నారచీరలను; ఆహరన్ = తెచ్చియిచ్చుచున్నవాడై; (తవ = నీకు;) మన్యుం = క్రోధమును (దుఃఖమును), కథం = ఎట్లు; న-కరోతి = చేయుటలేదు.

తాత్పర్యము : దేవేంద్ర సమానుడైన యెవ్వడు ఉత్తర కురుదేశములను జయించి అధికమైన స్వర్ణ రూప్య రూపమైన ధనమును నీకు దెచ్చి యిచ్చెనో ఆ యర్జునుడు ఇప్పుడు నీకు నారచీరలను దెచ్చియిచ్చుచు నీకు క్రోధ దుఃఖములను ఎట్లు కలిగింపకున్నాడు ?

వ్యాఖ్యానము : దేవేంద్రుని పుత్రుడై, దేవేంద్ర సమానుడైన యర్జునుడు తన పరాక్రమముచే ఉత్తర కురు భూములను జయించి అపారములైన ధన రాసులను ధర్మజునకు దెచ్చియిచ్చెను. ఆతడు జయించి తెచ్చిన రాజ్యమును, ధనమును ధర్మజుడు కపట ద్యూతమున నోడి శత్రువులకు వశముచేసి యడవులకు వచ్చెను. ఆ యర్జును డిప్పుడు ధర్మరాజునకు నారచీరెలు దెచ్చి యిచ్చుచుండెను. ఇట్టి దీనావస్థకు వచ్చిన ధనంజయుని జూచియు నీకు శత్రువులపై కోపమేల కలుగకున్నది అని ద్రౌపది ధర్మజునకు కోపము పుట్టింప యత్నించుచున్నది.

మన్యు శబ్దమునకు శోకము, క్రోధము అను రెండర్థములు కలవు. ధనంజయుని దీనదశనుచూచి నీకు శోకము కలుగుటలేదా క్రోధము కలుగుటలేదా ? అని ద్రౌపది.

శ్లో॥ వనాంతశయ్యా కఠినీ కృతాకృతీ
కచాచితౌ విష్వగి వాగజౌ గజౌ
కథం త్వ మేతౌ ధృతిసంయమౌ యమౌ
విలోకయ న్నుత్సహసే న బాధితుమ్. 36

పదవిభాగము : వనాంతశయ్యా కఠినీకృతాకృతీ, కచాచితౌ, విష్వక్, ఇవ, అగజౌ, గజౌ, కథం, త్వం, ఏతౌ, ధృతి సంయమౌ, యమౌ, విలోకయన్, ఉత్సహసే, న, బాధితుం.

అన్వయము : వనాంతశయ్యా కఠినీకృతాకృతీ విష్వక్ కచాచితౌ అగజౌ గజౌ ఇవ ఏతౌ యమౌ విలోకయన్ త్వం ధృతిసంయమౌ బాధితుం కథం న ఉత్సహసే ?

అర్థము : వనాంత = అరణ్యదేశమను; శయ్యా = శయ్యచేత; కఠినీకృత = కఠినముగా చేయబడిన; ఆకృతీ = శరీరముగలిగిన; విష్వక్ = అంతటను; కచ = వెంట్రుకలచేత; అచితౌ = వ్యాపింపబడిన; అగజౌ = పర్వతమునందు బుట్టిన; గజౌ + ఇవ = ఏనుగులవలెనున్నట్టి; ఏతౌ = ఈ; యమౌ = కవలను; విలోకయన్ = చూచుచు; త్వం = నీవు; ధృతి-సంయమౌ = తృప్తిని, నిగ్రహమును; బాధితుం = విడిచిపెట్టుటకు; కథం = ఎట్లు; న-ఉత్సహసే = ఉత్సహింపకున్నావు ?

తాత్పర్యము : అరణ్యప్రదేశమనెడి శయ్యచేత కఠినములు గావింపబడిన శరీరములు గలిగి, అంతటను కేశములచేత వ్యాపింపబడి, వనమునబుట్టిన యేనుగులవలె నున్న ఈ నకుల సహదేవులను జూచుచు నీవు సంతృప్తిని, నిగ్రహమును పరిత్యజించుటకు ఎట్లు ఉత్సహింపకున్నావు ?

అలంకారము ; ఉపమ.

వ్యాఖ్యానము: తల్లి లేనిపిల్లలని నకులసహదేవులను కుంతియెంతో ప్రీతితో పెంచెను. ధర్మజాదులు, ద్రౌపదియు వారిపట్ల మిక్కిలి యార్ద్రతతో వర్తింతురు. ఇప్పుడు ద్రౌపది వారి దయనీయావస్థను వర్ణించి, ఈ సుకుమారుల కడగండ్లను దిలకించియు నీకు శత్రువులపట్ల కోపము గలుగుట లేదా ? నీ ధైర్యమెంత

గొప్పది ? అని సాధిక్షేపముగా బలుకుచున్నది. పరమ సుకుమారులైన నకుల సహదేవులు కటికనేలపై బరుండుటచే మొద్దుబారి, సంస్కారము లేనందున కేశములు చెదరి చూడ జాలి గొల్పుచున్నారు. నకులసహదేవులు కొండయేనుగు గున్నలతో పోల్పబడిరి. గనుక ఉపమాలంకారము. కవల పిల్లలైన ఆ జంటను కలిపి యొకే శ్లోకమున వర్ణించుట చమత్కారము.

శ్లో॥ ఇమామహం వేద న తావకీం ధియం
విచిత్రరూపాః ఖలు చిత్తవృత్తయః
విచింతయంత్యా భవదాపదాం పరాం
రుజంతి చేతః ప్రసభం మమాధయః. 37

పదవిభాగము : ఇమాం, అహం, వేద, న, తావకీం, ధియం, విచిత్రరూపాః, ఖలు, చిత్తవృత్తయః, విచింతయంత్యాః, భవదాపదం, పరాం, రుజంతి, చేతః, ప్రసభం, మమ, ఆధయః.

అన్వయము : ఇమాం తావకీం ధియం అహం న వేద; చిత్తవృత్తయః విచిత్రరూపాః ఖలు; (కింతు) పరాం భవదాపదం విచింతయంత్యాః మమ చేతః ఆధయః ప్రసభం రుజంతి.

అర్థము : ఇమాం = ఈ; తావకీం = నీ సంబంధమైన; ధియం = మనస్సును; అహం = నేను; న-వేద = తెలియకున్నాను; చిత్తవృత్తయః = మనోగతులు; విచిత్ర-రూపాః-ఖలు = నానావిధస్వరూపములు గలవిగదా; (కింతు = కాని); పరాం = గొప్పదైన; భవత్ = నీయొక్క; ఆపదం = విపత్తును; విచింతయంత్యాః = ఆలోచించుచున్న; మమ = నాయొక్క; చేతః = చిత్తమును; ఆధయః = మనోవ్యధలు; ప్రసభం = బలాత్కారముగా; రుజంతి = పీడించుచున్నవి.

తాత్పర్యము : ఈ నీయొక్క చిత్తవృత్తిని నేను తెలిసికొన జాలకున్నాను. మనోవృత్తులు నానావిధస్వరూపములు గలవికదా. కాని గొప్పదైన నీ యాపదను గూర్చి చింతించుచున్న నా చిత్తమును మనోవ్యధలు బలాత్కారముగా పీడించుచున్నవి.

వ్యాఖ్యానము : లోకమున చిత్తవృత్తులు నానా విధములుగా నుండును. ఈ సమ యవస్థకు ద్రౌపది యెంతో కుమిలిపోవు చున్నది. కాని ధర్మరాజు చిత్త మెంత మాత్రమును చలించినట్లులేదు. చిత్తము అంతరంగము గనుక దాని వర్తనము ప్రత్యక్ష విషయముకాదు. ద్రౌపది తన చిత్తవృత్తిని బట్టి ధర్మజుని చిత్తవృత్తిని గుర్తింపవచ్చునన్నచో లోకమున చిత్తవృత్తులు నానావిధములుగా నుండును. ధీర-అధీర-ధీరాధీరాది రూపముల వ్యక్తుల స్వభావములు నానావిధ ములుగా నుండును. అధీరులను కలతపెట్టు సన్నివేశములు ధీరులను ఇంచుకయు చలింపజేయవు. కనుక ద్రౌపది స్వచిత్తవృత్తినిబట్టి ధర్మజుని చిత్తవృత్తిని ఊహింపజాలకున్నది. పాండవుల యాపదలనుగూర్చి తలచుకొన్నంతనే ద్రౌపది చిత్తమున తీవ్రమైన వ్యథ కలుగుచున్నది. ధర్మజుని మనస్సు ఎట్లున్నది ! ఇది ద్రౌపదికి అంతుపట్టలేదు. అనగా ధర్మరాజు మహాగంభీరుడు, సంయమి యని ధ్వని. "విచిత్రరూపాః ఖలు చిత్తవృత్తయః" అన్నది చక్కని సూక్తి.

శ్లో॥ పురాధిరూఢః శయనం మహాధనం
విబోధ్యసే యః స్తుతిగీతి మంగళైః
అదభ్ర దర్భా మధిశయ్య స స్థలీం
జహాసి నిద్రా మశివైః శివారుతైః. 38

పదవిభాగము : పురా, అధిరూఢః, శయనం, మహాధనం, విబోధ్యసే, యః, స్తుతిగీతి మంగళైః, అదభ్రదర్భాం, అధిశయ్య, సః, స్థలీం, జహాసి, నిద్రాం, అశివైః, శివారుతైః.

అన్వయము : యః (త్వం) మహాధనం శయనం అధిరూఢః (సన్) స్తుతిగీతిమంగళైః పురా విబోధ్యసే సః (త్వం) అదభ్రదర్భాం స్థలీం అధిశయ్య అశివైః శివారుతైః నిద్రాం జహాసి.

అర్థము : యః (త్వం) = ఏ నీవు; మహాధనం = మిక్కిలివెలగల; శయనం = శయ్యను; అధిరూఢః (సన్) = అధిరోహించినవాడవై; స్తుతి = స్తుతులచేతను; గీతి = గీతములచేతను; మంగళైః = మంగళవాద్యముల చేతను; పురా = పూర్వము; విబోధ్యసే = మేల్కొనుచుంటివో; సః (త్వం) = ఆ నీవు; అదభ్ర = విస్తారమైన; దర్భాం = దర్భలుగల; స్థలీం = నేలపై; అధి

శయ్య = శయనించి; అశివైః = అమంగళకరములైన; శివా-రుతైః = ఆడు నక్కల కూతలచేత; నిద్రాం = నిద్రను; జహాసి = వీడుచున్నావు.

తాత్పర్యము : ఏ నీవు ఎక్కువ విలువగల శయ్యను అధిరోహించి స్తుతులచేత, గానములచేత మంగళధ్వనులచేత మేల్కొంచు చుండువాడవో ఆ నీవు ఇప్పుడు విస్తారమైన దర్భలుగల కఠినమైన నేలపై శయనించి అమంగళకరము లైన యాడునక్కల కూతలచే నిద్రను విడుచుచున్నావు.

వ్యాఖ్యానము : భీమాదుల దయనీయస్థితిని వర్ణించి, ద్రౌపది చివరకు ధర్మజుని స్థితిని వర్ణించుచున్నది. ఆయన పూర్వ వైభవమును ప్రస్తుత శోచనీయావస్థను ఏక వాక్యమున నిబంధించి ప్రతియోగముచే ప్రకృతావస్థ యొక్క శోచనీయత్వమును తీవ్రముగా చిత్రించుచున్నది.

ధర్మజుడు పూర్వము వెలలేని హంసతూలికా తల్పమున శయనించుచుండు వాడు. ఇప్పుడు కఠినములైన దర్భలపై శయనించుచున్నాడు. పూర్వము వైతాళికుల స్తుతిరూప మంగళగానములు వినుచు మేల్కాంచుచుండువాడు. ఇప్పుడు అమంగళకరములైన నక్కల కూతలు వినుచు మేల్కాంచుచున్నాడు. ఎట్టి వాడెట్టి స్థితికి వచ్చినాడు ? ఇందుకు ద్రౌపది దుఃఖించుచున్నది కాని అనుభవించు చున్న ధర్మరాజు దుఃఖించుటలేదు. అది ఆయన ధీరోదాత్తత.

శ్లో॥ పురోపనీతం నృప రామణీయకం
ద్విజాతి శేషేణ యదేత దంధసా
తదద్య తే వన్య ఫలాశినః పరం
పరైతి కార్శ్యం యశసా సమం వపుః. 39

పదవిభాగము : పురా, ఉపనీతం, నృప, రామణీయకం, ద్విజాతిశేషేణ, యత్, ఏతత్, అంధసా, తత్, అద్య, తే, వన్యఫలాశినః, పరం, పరైతి, కార్శ్యం, యశసా, సమం, వపుః.

అన్వయము : హే నృప ! యత్ ఏతత్ (వపుః) పురా ద్విజాతిశేషేణ అంధసా రామణీయకం ఉపనీతం, వన్యఫలాశినః తే తత్ వపుః అద్య యశసా సమం పరం కార్శ్యం పరైతి.

అర్థము : హే నృప = ఓ రాజా; యత్ = ఏ; ఏతత్ = ఈ; (వపుః = శరీరము); పురా = పూర్వము; ద్విజాతి = బ్రాహ్మణులకంటె; శేషేణ = మిగిలియున్న; అంధసా = అన్నముచేత; రామణీయకం = సౌందర్యమును; ఉపనీతం = పొందింపబడినదో; వన్య = వనమునబుట్టిన; ఫల = పండ్లను; అశినః = తినుచున్న; తే = నీయొక్క; తత్ = ఆ; వపుః = శరీరము; అద్య = ఇప్పుడు; యశసా-సమం = కీర్తితోపాటు; పరం = అత్యంతము; కార్శ్యం = కృశత్వమును; పరైతి = పొందుచున్నది.

తాత్పర్యము : ఓ రాజా! ఏ యీ శరీరము బ్రాహ్మణులు భుజింపగా మిగిలియున్న అన్నముచే రామణీయకమును పొందింప బడినదో అరణ్యభవము లయిన ఫలములను భుజించుచున్న నీ యొక్క ఆ శరీరము ఇప్పుడు నీ కీర్తితో పాటు మిక్కిలి కృశత్వమును పొందుచున్నది.

అలంకారము : సహోక్తి.

వ్యాఖ్యానము : పూర్వము ధర్మజుడు ద్విజాతి (బ్రాహ్మణ) భుక్తశేషమైన యన్నము భుజించి దృఢగాత్రుడై యుండెడివాడు. ఇప్పుడు (ద్విజాతి) పక్షులు తినగా మిగిలిన అడవిపండ్లు తిని కృశగాత్రుడై యున్నాడు. ఆయన శరీరమే కాక దానితోపాటు ఆయన కీర్తియు కృశించుచున్నదని ద్రౌపది యనుచున్నది. శత్రుకృతావమానము సహించి యడవులందుండుటచే ధర్మజుని కీర్తి తరిగిపోవుచున్నదని ద్రౌపది యభిప్రాయము. కాని ధర్మమునకు కట్టుబడి సమయ పాలనము చేయుటచే ధర్మజుని కీర్తి వర్ధిల్లుచున్నదేకాని క్షీణించుటలేదు.

శరీరముతోపాటు కీర్తియు కృశించుచున్నది అనుటవల్ల సహోక్తి అలంకారము. శరీరకృశత్వమునకు, కీర్తి కృశత్వమునకు సహభావము చెప్పబడినది.

శ్లో॥ అనారతం యౌ మణిపీఠశాయినా
వరంజయ ద్రాజశిరస్స్రజాం రజః
నిషీదతస్తౌ చరణౌ వనేషు తే
మృగ ద్విజాలూన శిఖేషు బర్హిషామ్. 40

పదవిభాగము : అనారతం, యౌ, మణిపీఠశాయినౌ, అరంజయత్, రాజ శిరస్స్రజాం, రజః, నిషీదతః, తౌ, చరణౌ, వనేషు, తే, మృగద్విజాలూనశిఖేషు, బర్హిషాం.

అన్వయము : అనారతం మణిపీఠశాయినౌ యౌ చరణౌ రాజశిరస్స్రజాం రజః అరంజయత్ తౌ తే చరణౌ (అద్య) మృగద్విజాలూన శిఖేషు బర్హిషాం వనేషు నిషీదతః.

అర్థము : అనారతం = ఎల్లప్పుడు; మణిపీఠ = మణిపీఠమందు; శాయినౌ = ఉండునటువంటి; యౌ = ఏ; చరణౌ = చరణములను; రాజ = రాజులయొక్క; శిరః = శిరములందలి; స్రజాం = మాలికలయొక్క; రజః = ధూళి; అరంజయత్ = రంజిల్ల చేసెనో; తౌ = ఆ; తే = నీయొక్క; చరణౌ = చరణములు; (అద్య = ఇప్పుడు); మృగ = లేళ్ళచేతను; ద్విజ = బ్రాహ్మణుల చేతను; ఆలూన = త్రుంచబడిన; శిఖేషు = అగ్రములుగల; బర్హిషాం = దర్భలయొక్క; వనేషు = వనములందు; నిషీదతః = ఉన్నవి.

తాత్పర్యము : ఎల్లప్పుడు మణిపీఠమందుండు నటువంటి ఏ నీ చరణములను రాజుల శిరస్సులందలి పుష్పమాలికల యొక్క పరాగము రంజిల్ల జేయుచుండెడిదో ఆ నీ చరణములు నేడు లేళ్ళచేతను, విప్రులచేతను త్రుంచబడిన యగ్రములుగల దర్భలవనమునందు ఉన్నవి.

వ్యాఖ్యానము : వనవాసమునకు రాకపూర్వము ధర్మజుడు రాజ్యముచేసినది మిక్కిలి అల్పకాలమే. కాని ఆ స్వల్పకాలమునందే ఆయన దిగ్విజయము చేసి, రాజసూయయాగము గావించెను. నానారాజన్యు లాయన పాదములకు మ్రొక్కులిడుచుండిరి. అట్టి మహాప్రభు విప్పుడు వనమున నివసించుచున్నాడు. ఆయన పాదములు కరకు దర్భలమై సంచరించుచున్నవి. ఈ విపరీత పరిస్థితి ద్రౌపదికి తీవ్రమైన యావేదన కలిగించుచున్నది. అనుభవించుచున్న ధర్మజుడు మాత్రము ధీరముగనే యుండెను.

శ్లో॥ ద్విషన్నిమిత్తా యదియం దశా తతః
సమూల మున్మూల యతీవ మే మనః
పరై రపర్యాసిత వీర్యసంపదాం
పరాభవోఽప్యుత్సవ ఏవ మానినామ్. 41

పదవిభాగము : ద్విషన్నిమిత్తా, యత్. ఇయం, దశా, తతః, సమూలం, ఉన్మూలయతి, ఇవ, మే, మనః, పరైః, అపర్యాసితవీర్యసంపదాం, పరాభవః, అపి, ఉత్సవః, ఏవ, మానినాం.

అన్వయము : యత్ ఇయం దశా ద్విషన్నిమిత్తా తతః మే మనః సమూలం ఉన్మూలయతి ఇవ; పరైః అపర్యాసితవీర్య సంపదాం మానినాం పరాభవః అపి ఉత్సవః ఏవ.

అర్థము : యత్ = ఏ కారణమువల్ల; ఇయం = ఈ; దశా = అవస్థ; ద్విషత్ = శత్రువులు; నిమిత్తా = హేతువుగాగలదో; తతః = అందువల్ల; మే = నాయొక్క; మనః = మనస్సు; సమూలం = నిశ్శేషముగా; ఉన్మూలయతి + ఇవ = పెల్లగించుచున్నదివలె నున్నది; పరైః = శత్రువులచే; అపర్యాసిత = నాశముచేయబడని; వీర్య-సంపదాం = బలసంపదగల; మానినాం = మానవంతులకు; పరాభవః + అపి = పరాభవము కూడ; ఉత్సవః + ఏవ = ఉత్సవమే యగును.

తాత్పర్యము : ఇటువంటి దురవస్థ శత్రువులు కారణముగాగలదనుటవల్ల అది నాయొక్క మనస్సును నిశ్శేషముగా పెళ్ళగించుచున్నదా యన్నట్లున్నది. శత్రువులచే ధ్వంసము చేయబడని వీర్యసంపదగల అభిమానవంతులకు అవమానముకూడ ఉత్సవమే యగునుగదా.

వ్యాఖ్యానము : దైవికములైన యాపదలు ఎవ్వరికైనను వచ్చును. వానిని సహించుట ధీరత్వమగును. మానవంతులైన వారికి సంభవించు దైవికములైన యాపదలు వారి ధీరతను ప్రకాశింప జేయునవై యానందకరములుగనే ఉండును. కాని ఆపదలు శత్రుకృతములైనచో మానవంతులకు అవి ప్రాణాంతకములుగా నుండును. పాండవుల యాపద శత్రుకృతమే యైనను, వారా యాపద సహించుటకు గారణము సమయపాలన దీక్షయే కాని నిర్వీర్యత్వముకాదు. ద్రౌపది మాత్రము నిర్వీర్యతయేయని తలంచుచున్నది.

శ్లో॥ విహాయ శాంతిం నృప ధామ తత్పునః
ప్రసీద సంధేహి వధాయ విద్విషామ్
వ్రజంతి శత్రూ నవధూయ నిఃస్పృహాః
శమేన సిద్ధిం మునయో న భూభృతః 42

పదవిభాగము : విహాయ, శాంతిం, నృప, ధామ, తత్, పునః, ప్రసీద, సంధేహి, వధాయ, విద్విషాం, వ్రజంతి, శత్రూన్, అవధూయ, నిఃస్పృహాః, శమేన, సిద్ధిం, మునయః, న, భూభృతః.

అన్వయము : హేనృప ! శాంతిం విహాయ తత్ధామ విద్విషాం వధాయ పునః సంధేహి; ప్రసీద; నిఃస్పృహాః మునయః శత్రూన్ అవధూయ శమేన సిద్ధిం వ్రజంతి; భూభృతః (తు) న.

అర్థము : హే నృప = ఓ రాజా; శాంతిం = శాంతిని; విహాయ = విడిచి; తత్ = ఆ; ధామ = తేజస్సును; విద్విషాం = శత్రువులయొక్క; వధాయ = నాశము కొఱకు; పునః = మరల; సందేహి = స్వీకరింపుము; ప్రసీద = ప్రసన్నుడవు కమ్ము; నిః స్పృహాః = కామరహితులైన; మునయః = మునులు; శత్రూన్ = శత్రువులను; అవధూయ = జయింపక; శమేన = శాంతముచేత; సిద్ధిం = ముక్తిని; వ్రజంతి = పొందుదురు; భూభృతః (తు) = రాజులన్ననో; న-వ్రజంతి = పొందరు.

తాత్పర్యము : ఓ రాజా! శాంతిని విడిచి ఆ తేజమును శత్రువధ కొఱకు మరల స్వీకరింపుము. దయజూడుము. నిష్కాములైన మునులు శత్రువులను జయింపక శాంతముచేతనే మోక్షము పొందుదురు. రాజులు మాత్రము పొందరు.

వ్యాఖ్యానము : ధర్మరాజు తేజస్వియే. కాని సమయపాలనా ధర్మబద్ధుడై శాంతి వహించియున్నాడు. ద్రౌపది కీ పద్ధతి నచ్చలేదు. ప్రతాపవంతుడయ్యీ శత్రుకృత పరాభవమును సహించుట రాజలక్షణము కాదు. కనుక స్వతస్సిద్ధమై యుండిన తేజస్సును మరల వహించి శత్రువును వధించిరాజ్యము సంపాదింపుము అని ద్రౌపది ధర్మజుని వేడుచున్నది. అంతః శత్రువులైన క్రోధాదులను నిర్జించి శాంతిచే మునులు మోక్షము సాధింతురు గాని రాజులు క్రోధము వహించి బహిః శత్రువులను జయింపనిదే రాజ్యము సాధింపజాలరు. మోక్షసాధన యోగ్యమైన శాంతము రాజ్యసాధన యోగ్యము కాదని భావము.

'ప్రసీద' అని ద్రౌపది ధర్మజునికి జాలి పుట్టింప యత్నించుచున్నది. ఇందువల్ల పరాభవదుఃఖ మామె. ధైర్యము నెంత కొల్లగొట్టినదో విశదమగు

చున్నది. శాంతి మునులకేకాని రాజులకు తగదనుటలో మెత్తని మందలింపు కలదు.

శ్లో॥ పురస్సరా ధామవతాం యశోధనాః
సుదుస్సహం ప్రాప్య నికార మీ దృశమ్
భవాదృశాశ్చే దధికుర్వతే రతిం
నిరాశ్రయా హంత హతా మనస్వితా. 43

పదవిభాగము : పురస్సరాః, ధామవతాం, యశోధనాః, సుదుస్సహం, ప్రాప్య, నికారం, ఈదృశం, భవాదృశాః, చేత్, అధికుర్వతే, రతిం, నిరాశ్రయా, హంత, హతా, మనస్వితా.

అన్వయము : ధామవతాం పురస్సరాః యశోధనాః భవాదృశాః సుదుస్సహం ఈదృశం నికారం ప్రాప్య రతిం అధికుర్వతే చేత్ హంత ! మనస్వితా నిరాశ్రయా (సతీ) హతా.

అర్థము : ధామవతాం = ప్రతాపవంతులలో; పురస్సరాః = అగ్రేసరులును; యశః + ధనాః = కీర్తియే ధనముగా గలవారునునైన; భవాదృశాః = నీ వంటివారు; సుదుస్సహం = సహింపరాని; ఈదృశం = ఇటువంటి; నికారం = పరాభవమును; ప్రాప్య = పొంది; రతిం = ప్రీతిని; అధికుర్వతే-చేత్ = స్వీకరింతురేని; హంత = అయ్యో; మనస్వితా = అభిమానశాలిత్వము; నిరాశ్రయా (సతీ) = ఆశ్రయములేనిదై; హతా = నాశమగును.

తాత్పర్యము : తేజశ్శాలురలో అగ్రేసరులు, యశస్సే ధనముగాగలవారునైన తమవంటివారు సహింపశక్యముగాని ఇటువంటి యవమానమును పొందియు తృప్తిని స్వీకరింతురేని అయ్యో ! అభిమానశాలిత్వము దిక్కులేనిదై నశించును.

వ్యాఖ్యానము : ద్రౌపదికి అభిమానము ప్రాణము. మానహాని ప్రాణహానికంటె దారుణమైనదని ఆమె యభిప్రాయము. మానమును రక్షించుకొనుటకు సత్యమును, ధర్మమును త్యజించుట ఆమె దృష్టిలో దోషము కాదు. ధర్మజుడును మానవంతుడే. అయినను ఆయనకు సత్యము, ధర్మము మానప్రాణముల కంటెను ప్రియతరములు. నీవంటివాడు దుస్సహమైన మానభంగమును

సహించి తృప్తిపడియున్నచో అభిమానము దిక్కులేనిదై పోవును అనుటలో నీవు అభిమానము చంపుకొనుచున్నావు అను గూఢమైన యధిక్షేపము కలదు. సత్యధర్మములను భంగము చేసినచో తనకు మానభంగమైనట్లు ధర్మజుడు భావించును. శత్రువులు వంచనచే చేసిన మానభంగము యథార్థముగా మానభంగము కాదనియు, అది అకీర్తికరము కాదనియు ధర్మజుని యభిప్రాయము. సమయ పాలనముద్వారా సత్యధర్మములను పరిరక్షించుటకే ఆయన శాంతి వహించెనుగాని అభిమానము లేకకాదు.

శ్లో॥ అథ క్షమా మేవ నిరస్త విక్రమ
శ్చిరాయ పర్యేషి సుఖస్య సాధనమ్
విహాయ లక్ష్మీపతి లక్ష్మ కార్ముకం
జటాధరః సన్ జుహుధీహ పావకమ్. 44

పదవిభాగము: అథ, క్షమాం, ఏవ, నిరస్త విక్రమః, చిరాయ, పర్యేషి, సుఖస్య, సాధనం, విహాయ లక్ష్మీపతిలక్ష్మ, కార్ముకం, జటాధరః, సన్, జుహుధి, ఇహ, పావకం.

అన్వయము: అథ నిరస్తవిక్రమః (సన్) చిరాయ క్షమాం ఏవ సుఖస్య సాధనం పర్యేషి (తర్హి) లక్ష్మీపతిలక్ష్మ కార్ముకం విహాయ జటాధరః సన్ ఇహ పావకం జుహుధి.

అర్థము: అథ = ఒకవేళ; నిరస్త = విడువబడిన; విక్రమః (సన్) = పరాక్రమము గలవాడవై; చిరాయ = చిరకాలము; క్షమాం + ఏవ = సహనమునే; సుఖస్య = సుఖమునకు; సాధనం = సాధనముగా; పర్యేషి = నిశ్చయింతువా; (తర్హి = అట్లయిన); లక్ష్మీపతి = రాజులకు; లక్ష్మ = చిహ్నమగు; కార్ముకం = వింటిని; విహాయ = విడిచి; జటాధరః-సన్ = జడలు ధరించినవాడవై; ఇహ = ఇచ్చట; పావకం = అగ్నిని; జుహుధి = హోమముచేయుము.

తాత్పర్యము: ఒకవేళ విడువబడిన పరాక్రమము గలవాడవై చిరకాలము సహనమునే సుఖసాధనముగా స్వీకరింపదలచితివా? అట్లయినచో రాజ చిహ్నమైన కార్ముకమును విడిచి జడదారివై యీ వనమున అగ్నికి హోమము చేయుచుండుము.

వ్యాఖ్యానము : ద్రౌపది యింత సేపు ఉపన్యసించినను ధర్మరాజు శాంతముగా వినుచుండెనేకాని ఏమియు పలుకలేదు. క్షమ, శాంతి ఉత్తమ మానవ ధర్మములు. ఆయన వానిని అవలంబించి యుక్తసమయము కొఱకు వేచి యుండెను. క్షమ కోల్పోయిన ద్రౌపది ఆయన నధిక్షేపించుచున్నది. ధర్మరాజు నిరస్త నిక్రముడగుటకు కారణము ఆయన అత్తి ధర్ముడగుటయే. క్రోధము దుఃఖహేతువు, క్షమ సుఖహేతువు అగుట పరమసత్యము. ధర్మజుడు ఆ విశ్వాసము కలవాడు. క్షమ రాజధర్మము కాకున్నను రాజర్షి ధర్మము. ధర్మజుడు రాజర్షి.

రాజలక్షణమైన కార్ముకమును వీడి జటాధరుడవై యగ్నికి హోమములు చేయుచు ఈ యడవియందే యుండుము అనుట ద్రౌపది యసహనమునకుగుర్తు. ఆ యసహనముచే ధర్మజుని కార్ముకమును వీడుము అని తీవ్రముగా మందలించుచున్నది. క్షత్రియుడైన వాడిట్టిమాట సహింపడు. కాని ధర్మజుడు సహించెను. సహనము కోల్పోయి ద్రౌపది పలుకుచున్నదని ఆయనకు తెలియును.

శ్లో॥ న సమయ పరిరక్షణం క్షమం తే
నికృతి పరేషు పరేషు భూరిధామ్నః
అరిషు హి విజయార్థినః క్షితీశా
విదధతి సోపధి సంధిదూషణాని. 45

పదవిభాగము : న, సమయపరిరక్షణం, క్షమం, తే, నికృతిపరేషు, పరేషు, భూరిధామ్నః, అరిషు, హి, విజయార్థినః, క్షితీశాః, విదధతి, సోపధి, సంధి దూషణాని.

అన్వయము : పరేషు నికృతిపరేషు (సత్సు) భూరిధామ్నః తే సమయ పరిరక్షణం న క్షమం; హి విజయార్థినః క్షితీశాః అరిషు సోపధి సంధిదూషణాని విదధతి.

అర్థము : పరేషు = శత్రువులు; నికృతిపరేషు (సత్సు) = అవమానమొనర్చుట యందాసక్తి కలవారై యుండగా; భూరి-ధామ్నః = గొప్ప తేజస్సు గలిగిన; తే = నీకు; సమయ = ప్రతిజ్ఞ యొక్క-; పరిరక్షణం = పరిపాలనము; న-క్షమం = యుక్తముకాదు; హి = ఎందువల్లననగా; విజయార్థినః = విజయ

మును గోరునట్టి; క్షితీశాః = రాజులు; అరిషు = శత్రువులందు; సోపధి = కపటముతో; సంధి = సంధియొక్క; దూషణాని = దూషణములను, భంగములను; విదధతి = చేయుదురు.

తాత్పర్యము : శత్రువులు అవమానము చేయుటయే ప్రధానముగా గలవారై యున్నప్పుడు మహాతేజశ్శాలివైన నీకు ప్రతిజ్ఞాపాలనము యుక్తముకాదు. ఏలన, విజయార్థులైన రాజులు శత్రువులపట్ల కపటముతో సంధి భంగములు చేయుచుందురు.

అలంకారము : అర్థాంతరన్యాసము.

వ్యాఖ్యానము : అపకారము చేసిన శత్రువు విషయమున నీకు సమయ పాలనము అనవసరము అని ద్రౌపది పలికిన మాట సామాన్య రాజనీతి. విజయము సంపాదింపగోరిన రాజులు శత్రువులపట్ల కపటము ప్రయోగించి సంధి భంగము చేయుదురనుట అధమ క్షితీశుల మార్గము. ఇది ఉత్తమ రాజనీతి యైనచో దుర్యోధనుడు చేసిన దోషమేమున్నది? శత్రువు కపటి యైనను వానితో చేసికొన్న సమయమును పాలించుట ఉత్తమ క్షత్రియధర్మమని ధర్మజుని నీతి. లోక సామాన్యమైన యొక అంశముచే ద్రౌపది ధర్మజుడు కపటము నవలంబించుట యుక్తమని సమర్థించుచున్నది గనుక ఇది అర్థాంతరన్యాసము.

ఛందము : పుష్పితాగ్రావృత్తము.

1, 3 పాదములు : ననరయ గణములు

2, 4 పాదములు : నజజరగ గణములు

శ్లో॥ విధిసమయనియోగాద్దీప్తి సంహార జిహ్మం
శిథిలవసు మగాధే మగ్న మాపత్పయోధౌ
రిపు తిమిర ముదస్యోదీయమానం దినాదౌ
దినకృత మివ లక్ష్మీ స్త్వాం సమభ్యేతు భూయః. 46

పదవిభాగము : విధిసమయనియోగాత్, దీప్తిసంహారజిహ్మం, శిథిలవసుం, అగాధే, మగ్నం, ఆపత్పయోధౌ, రిపుతిమిరం, ఉదస్య, ఉదీయమానం, దినాదౌ, దినకృతం, ఇవ, లక్ష్మీః, త్వాం, సమభ్యేతు, భూయః.

అన్వయము : విధిసమయనియోగాత్ అగాధే ఆపత్పయోధౌ మగ్నం దీప్తి సంహారజిహ్మం శిథిలవసుం, రిపు తిమిరం ఉదస్య ఉదీయమానం త్వాం దినాదౌ దినకృతం ఇవ లక్ష్మీః భూయః సమభ్యేతుః.

అర్థము : విధి = విధియొక్కయు; సమయ = కాలముయొక్కయు; నియోగాత్ = నియమమువలన; అగాధే = లోతైన; ఆపత్ + పయోధౌ = సముద్రమువంటి ఆపదయందు; మగ్నం = మునింగినట్టియు; దీప్తి = ప్రతాపము యొక్క; సంహారం = సంకోచముచే; జిహ్మం = అప్రసన్నమైనట్టియు; శిథిల = శిథిలమైన; వసుం = ధనము గలిగినట్టియు; రిపుతిమిరం = అంధకారమువంటి శత్రువులను; ఉదస్య = పోగొట్టి; ఉదీయమానం = ఉదయించుచున్నట్టియు; త్వాం = నిన్ను; దినాదౌ = ప్రాతఃకాలమందు; దినకృతం + ఇవ = సూర్యుని వలె; లక్ష్మీః = లక్ష్మి; భూయః = తిరిగి; సమభ్యేతు = పొందునుగాక.

తాత్పర్యము : విధియొక్కయు, కాలముయొక్కయు నియమమువలన అగాధమైన యాపత్సముద్రమున మునిగినట్టియు, ప్రతాపముయొక్క సంకోచము వల్ల అప్రసన్నుడైనట్టియు, శిథిలమైన ధనముగలట్టియు, అంధకారము వంటి శత్రువులను పాఱదోలి యుదయించుచున్నట్టియు నిన్ను ప్రాతఃకాలమున సూర్యునివలె లక్ష్మి తిరిగి పొందునుగాక.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : సమయము అనగా కాలము, నియమము అనియు దీప్తి యనగా తేజము, ప్రతాపము అనియు అర్థ ద్వయము కల్పించుకొనవలెను. ధర్మ జుడు విధికి, ద్యూత నియమమునకు వశుడై ప్రతాపము తగ్గి, ధనము కోల్పోయి, ఆపదయందు మునిగినాడు. సూర్యుడు విధికి, కాలమునకు వశుడై తేజము తగ్గి, రశ్మి కోల్పోయి సముద్రమున మునిగినాడు. సూర్యుడు మరల చీకటిని పార దోలి ఉదయించి శోభను ధరించును. అట్లే ధర్మజుడును శత్రువును పారదోలి యభ్యుదయము పొంది యైశ్వర్యవంతుడు కావలెను. ఇది ద్రౌపది యాకాంక్ష.

ధర్మజుని యభ్యుదయము సూర్యుని యుదయముతో పోల్పబడినది గనుక ఉపమాలంకారము. సమాన ధర్మ నిరూపకములగు సమయ, తేజశ్శబ్దములు శ్లిష్టములు గనుక ఈ యుపమ శ్లేషానుప్రాణితము.

సర్గాంత శ్లోకమున లక్ష్మీ శబ్దమును ప్రయోగించుట భారవి నియమము. ఆపత్సముద్రము, రిపు తిమిరము అను సమాసములను ఉపమిత సమాసములుగా గ్రహింపవలెను. అట్లు గ్రహించుట ఉపమాలంకారమునకు అనుకూలముగా నుండును.

ఛందము : మాలినీ వృత్తము.

గణములు : ననమయయ.

యతి : ఎనిమిది అక్షరములమీద.

కిరాతార్జునీయమున ప్రథమ సర్గము

ఆంధ్ర "బాలసుధా" వ్యాఖ్యా సహితము

సమాప్తము

ఇతి శివమ్

# సారాంశము

## ప్రథమ సర్గము

అనుద్యూత పరాజితుడై పత్నీ సోదర సహితుడై యరణ్యావాసము చేయుచు ద్వైత వనమున నివసించు చుండిన ధర్మరాజు దుర్యోధనుని పరిపాలనా విధానమును గూర్చి తెలిసి కొనుటకై యొక వనచరుని గూఢచారిగా బంపెను. వాడును బ్రహ్మచారి వేషము ధరించి కురు రాజ్యములందు సంచరించి దుర్యోధనుని పరిపాలనా విధానమును సమగ్రముగా నెఱింగి ధర్మజుని వద్దకు తిరిగి వచ్చెను. ధర్మరాజునకు నమస్కరించి, ప్రజారంజకమగు పరిపాలనచే దుర్యోధనుడు ఎట్లు సర్వ రాజ్యమును వశపఱచుకొని యుండెనో విన్నవింప బోవు ఆ వనచరుని మనస్సు ఎంతమాత్రమును వ్యథ పొందలేదు. ప్రభువు యొక్క క్షేమమును కాంక్షించు సేవకులు ప్రియముగా మందును గదా యని యెన్నడును అసత్యము పలుకజాలరు గదా. ఏకాంత ప్రదేశమున గూర్చుండి శత్రు విఘాతము గావించు టెట్లా యని యాలోచించు చుండిన ధర్మజుని యనుజ్ఞ పొంది, లోపల ప్రవేశించి ఆ గూఢచారి శబ్ద సాధుత్వము, అర్థగాంభీరము, వినిశ్చితమైన యర్థముగల తీరున నిట్లు చెప్ప దొడంగెను.

### వనచరుని నివేదిక

"ప్రభూ! చారచక్షువులైన రాజులు క్రియలందునియుక్తులైన సేవకులకు వంచింపదగినవారు కారు. కనుక నేను చెప్పబోవు విషయము ప్రియమైనదైనను అప్రియమైన దైనను, తాము క్షమింప వలయును. హితమును మనోహరమును నైన వాక్యము ప్రపంచమున దుర్లభము గదా! ప్రభువునకు హితమైన వాక్యమును ఉపదేశింపని సఖుడు కుత్సిత సఖుడు. హితునివలన సదుపదేశమును వినని ప్రభువు కుత్సితప్రభువు. రాజులును, మంత్రులు పరస్పరము ఎల్లప్పుడును అనుకూలురై యుండిననే సర్వ సంపదలు వారియందు అనురక్తములగును. సహజముగా గ్రహింపశక్యము గాని ప్రభువుల ప్రవర్తన మెక్కడ, అజ్ఞానోపహతులైన మావంటి పామరు లెక్కడ? శత్రువుల నిగూఢమైన రాజనీతిమార్గమును నేను గ్రహింపగలిగి

నన్నచో దానికి గారణము తమ మహత్వమే. ఆ దుర్యోధనుడు సింహాసనము నందున్నవాడయ్యు అరణ్యవాసము చేయుచున్న నీ వలన పరాజయమును శంకించు చున్నవాడై జూదపు మిషచే జయించిన రాజ్యమును రాజనీతిచే వశపరచుకొనవలె నని యత్నించుచున్నాడు. అయినప్పటికిని కుటిల బుద్ధియైన ఆ దుర్యోధనుడు నిన్ను జయించవలెనన్న యభిలాషతో దాక్షిణ్యాదిగుణ సంపదచే నిర్మలమైన కీర్తిని పెంపొందించుకొనుచున్నాడు. కీర్తిని ఐశ్వర్యమును వృద్ధి చేయునదై మహాత్ములతోడి వైరముకూడ దుర్జనులతోడి సాంగత్యముకంటె కొంత మేలే యగుచున్నది.

కామ క్రోధాదులైన యంతశ్శత్రువులను జయించి, ఎవ్వరికిని గ్రహింప శక్యముగాని నిగూఢమైన మనుధర్మమార్గము యొక్క తత్వము నందుకొనగోరి, అలసతను పరిత్యజించి ఆ దుర్యోధనుడు రాత్రింబవళ్లు యథోచితముగా విభ జింపబడిన నీతిని అవలంబించి పురుష కారమును విస్తరింపజేయు చున్నాడు. అహంకారము వర్జించి యా దుర్యోధనుడు భృత్యులను ప్రేమ పాత్రులైన మిత్రులవలెను, మిత్రులను బంధువులతో సమానమైన గౌరవము గలవారినిగాను, బంధువులను రాజ్యాధికారముగల ప్రభువుల వలెను నిష్కపటబుద్ధితో మన్నించు చున్నాడు. ఆ దుర్యోధనుడు ధర్మము, అర్థము, కామము అను మూడు పురు షార్థములను ఉచితమైన తీరున విభజించి సమానమైన భక్తితో ఆరాధించు చున్నాడు. అందువల్ల ఆతని గుణసంపదయందు అనురక్తి పొందినదా యన్నట్లు ఆతని పురుషార్థత్రయము ఒకదాని నొకటి బాధింపకుండెను. ఆ దుర్యోధనుని సామోపాయ ప్రయోగము దానమును విడిచియుండుటలేదు. గొప్పదైన ఆతని దానము సత్కారమును విడిచి యుండుటలేదు. విశేషమైన ఆ సత్కారము గుణ సంపదను వదలి యుండుటలేదు.

ఇంద్రియ నిగ్రహణముగల ఆ దుర్యోధనుడు ధనాపేక్షచేగాని, క్రోధముచే గాని దోషులను శిక్షించుటలేదు. లోభ క్రోధాదికారణము లెవ్వియు లేకుండగనే రాజధర్మము గదాయని మాత్రమే ఆతడు ప్రాడ్వివాకులచే నిర్ణయింపబడిన దండ మును ప్రయోగించి శత్రువులందును, పుత్రులందును గూడ ధర్మ వ్యతిక్రమమును నివారించుచున్నాడు. సర్వదేశములందును విశ్వాసపాత్రులైన గూఢచారులను నియమించి ఆ దుర్యోధనుడు శంకగలవాడయ్యు శంకలేనివానివలె వర్తించు చున్నాడు. ఆ యా కార్యములు సమాప్తములైనప్పుడు వానిని నిర్వహించిన

భృత్యులకు ఆత డొసంగు సంపదలు వారిపట్ల ఆతడెంత కృతజ్ఞత ప్రదర్శించునో వెల్లడి చేయుచున్నవి.

ఏ వస్తువును పొందుటకు ఏ యుపాయమును ప్రయోగించవలెనో చక్కగా గుర్తించి ప్రయోగింప బడుటచే ఆ దుర్యోధనుని సామదాన భేద దండోపాయములు పరస్పరము స్పర్ధ వహించినవా యన్నట్లు ఆతనికి అపారములైన సంపదలను సమకూర్చి పెట్టుచున్నవి. పలువురు రాజుల రథములచేతను అశ్వముల చేతను, సమ్మర్దముగా నుండు ఆ దుర్యోధనుని యాస్థాన మందిర ప్రాంగణము ఆ రాజులచే ఉపాయనములుగా నొసంగబడిన భద్రగజముల ఏడాకుల యరటిపూవు వాసనగల మదజలముచే దడిసినదిగా చేయబడుచుండును. ఆ దుర్యోధనుడు చిరకాలముగా క్షేమ కరములైన సౌకర్యములు గలిగించుచుండుటచే కురుదేశములు నదీ మాతృకములై దున్నకయే పండుచున్నవా యన్నట్లుండి కర్షకులకు సుఖముగా పంటలను లభింపజేయుచున్నవి. గొప్ప కీర్తి గలవాడు, దయాశాలి, సంరక్షణచే సర్వ బాధలు శమించుతీరున అభ్యుదయము గలిగించువాడు, కుబేరసమానుడు నైన ఆ దుర్యోధనుని దయాది సద్గుణములచే ఆర్ద్రత బొందినదాయన్నట్లు భూదేవి స్వయముగనే సంపదలను పిదుకుచున్నది.

గొప్ప బలము గలవారు, మానమే ధనముగా గలవారు, ధనములచే అర్చింపబడినవారు, యుద్ధములందు పొందబడిన కీర్తి గలవారు, స్వార్థము కొఱకై కూటమి కట్టనివారు, పరస్పరము నిరోధింపనివారు నైన మహాధనుర్ధరులు తమ ప్రాణము లర్పించియైనను దుర్యోధనునకు ప్రియములు చేయగోరుచున్నారు. జాగరూకుఁడై సర్వకార్యములను యథాకాలమున నిర్వర్తించుచున్న ఆ దుర్యోధనుడు యోగ్యమైన నడవడిగల గూఢచారులచే సర్వ రాజులయొక్క చర్యలను సంపూర్ణముగా దెలిసికొనుచున్నాడు. బ్రహ్మదేవునియొక్క ప్రయత్నములవలె ఆ దుర్యోధనునియొక్క ప్రయత్నములుకూడ హితంకరములైన గొప్ప ఫలములచేత మాత్రమే తెలియదగినవై యున్నవి.

ఆ దుర్యోధను డెప్పుడును వింటినెక్కుపెట్టినట్లు కనబడదు. ఆతని ముఖ మెన్నడును కోపముచే కుటిలమైన జాడలేదు. గుణమునందలి ప్రీతివల్ల ఆతని యాజ్ఞ రాజులచే పూలదండవలె శిరసావహింప బడుచున్నది. ప్రదీప్తమైన శాసనముగల ఆ దుర్యోధనుడు నూత్న యౌవనముచే దర్పితుడై యున్న దుశ్శా

సనుని యువరాజ పదవి యందుంచి, పురోహితుని యనుమతితో నిరంతరము యాగములు చేయుచు ఆజ్యాదిహవిస్సుచే అగ్నిని ఆరాధించుచున్నాడు. రాజుల నెల్లరను వశపరచుకొని సముద్రపర్యంతమైన భూమండలమును స్థిరముగా శాసించుచున్న వాడయ్యు ఆ దుర్యోధనుడు నీ వల్ల కలుగబోవు భయములను గుఱించి చింతించుచునే యున్నాడు. ఔరా ! బలవంతులతోడి వైరముదురంతము గదా ! ప్రసంగము వశమున జనులచే పేర్కొనబడిన నీ నామధేయము విని, అర్జునుని యొక్క పరాక్రమము గుర్తునకురాగా ఆ దుర్యోధనుడు గరుడని యొక్కయు, వాసుకియొక్కయు నామధేయములుగల దుస్సహమైనమంత్రశబ్దము వలన గరుత్మంతుని పాదక్షేపమును స్మరించు సర్పమువలె తలవంచుకొని దుఃఖ పడుచున్నాడు.

కావున నీ పట్ల కపటము ప్రయోగింప పూనుకొనిన దుర్యోధనునియందు చేయదగిన ప్రతీకారమును శీఘ్రముగా చేయుదువు గాక. పరులచే పలుకబడిన మాటలను మాత్రమే సంగ్రహించి నివేదించు మా వంటి వారి పలుకులు కేవలము వార్తలే యగును గాని ఉపదేశములు కాజాలవు."

ఈ విధముగా బలికి, ధర్మజు డొనర్చిన సత్కారమును గ్రహించి యా వనచరుడు వెడలిపోయెను. అనంతరము ధర్మజుడు ద్రౌపదీమందిరమునకుబోయి యచ్చట తన యనుజుల సమక్షమున ఆ వనచరుడు చెప్పిన మాటలు చెప్పెను.

## ద్రౌపది యుపదేశము

ద్రౌపదియు శత్రువుల యభివృద్ధినిగూర్చి విని వారివలన గలిగిన యవమానములను భరింప నశక్తయై ధర్మజుని క్రోధమును దీపింపజేయునట్టి వాక్యములను బలుకనారంభించెను.

"తమ వంటి వారిపట్ల నా వంటి స్త్రీ పలుకెడు ఉపదేశవాక్యము అధిక్షేపముగా తోపవచ్చును. ఐనప్పటికిని స్త్రీ జనోచితములైన యాచారములను తొలగద్రోయు మానసిక వ్యధలు నన్ను మాటాడుటకు ప్రేరేపించుచున్నవి. దేవేంద్రునితో సమానమైన ప్రభావముగల కురువంశ భూపతులు చిరకాలము అవిచ్ఛిన్నముగా ధరించిన ఈ భూమిని మదము స్రవించుచున్న యేనుగు పూల దండనువలె నీవు చేతితో విసరివైచితివి. మాయావుల విషయమున మాయా

వులుగాని మందబుద్ధులు పరాభవము పొందుదురు. కవచాదులచే కప్పబడని శరీరములు గలవారిని వాడియైన బాణములు వలె అట్టి అమాయకులను ధూర్తులు ఛేదించి హింసింతురు. అనుకూలమైన సహాయ సంపత్తి గలిగి కులాభిమానము గలవాడు నీవు తప్ప వేరెవ్వడు సౌందర్యాది గుణములచే అనురక్తయు సద్వంశ జాతయు, మనోరమయు నైన భార్యనువలె సంధ్యాదిగుణములచే అనుకూలము, కులక్రమాగతము, మనోహరమునైన రాజ్యలక్ష్మిని శత్రువులు పరాభవించు చుండగా ఊరకుండును ?

ఓ నరేశ్వరా ! ఇనప్పటికిని మానధనులచే గర్హింపబడిన మార్గమున వర్తించుచున్న నిన్ను ఎండిన జమ్మిచెట్టును అగ్నివలె ఉద్దీపితమైన క్రోధము ఏల మండ జేయకున్నది ? వ్యర్థముకాని కోపము గలిగి, యాపదలను నాశము చేయగల మహాత్మునకు జనులు తమంతి తామే వశవర్తులగుదురు. క్రోధ రహితుడైన మానవుడు స్నేహముగలవాడైనను ప్రీతి కలుగదు, శత్రువైనను భీతి కలుగదు.

పూర్వము రక్తచందన లేపనమునకు అలవాటుపడిన మహారథుడైన యీ భీమసేనుడు ఇప్పుడు ధూళిధూసరితుడై పాదచారియై పర్వతముల నడుమ సంచరించుచుండగా దిలకించి సత్యధనుడవైన నీ చిత్తము పరితపించుట లేదా ? దేవేంద్ర సమానుడై ఉత్తర కురు భూములను జయించి పూర్వము నీకు అపారమైన ధనరాసులను దెచ్చి యిచ్చిన అర్జునుడు నేడు నీకు నారచీరెలు తెచ్చి యిచ్చుచుండ నీకు క్రోధము, దుఃఖము కలుగుట లేదా ? అరణ్య భూమి యందు పరుండుటచే కఠినములైన శరీరములు గలిగి అంతటను కేశములచే వ్యాపింపబడి అడవి యేనుగు గున్నలవలె నున్న ఈ నకుల సహదేవులను చూచుచు నీవు సంతృప్తిని నిగ్రహమును ఎట్లు వహించుచున్నావు ? ఇట్టి నీ చిత్తవృత్తిని నేను గ్రహింపజాలకున్నాను. లోకమున మనోవృత్తులు నానా విధములుగా నుండును. కాని నీ యాపదనుగురించి చింతించుచున్న నా చిత్తమును మనోవ్యథలు బలాత్కారముగా పీడించుచున్నవి.

మిక్కిలి విలువగల శయ్యపై బరుండి స్తుతులచేత, గానములచేత, మంగళ ధ్వనులచేత మేల్కొంచుచుండిన నీవు ఇప్పుడు విస్తారమైన దర్భలు గల కటికనేలపై శయనించి అమంగళకరములైన అడునక్కకూతలచే నిద్ర

పీడుచున్నావు. బ్రాహ్మణులు భుజింపగా మిగిలిన యన్నముచే రమణీయముగ వర్ధిల్లిన ఈ నీ శరీరము అరణ్య భవములైన ఫలములను భుజించుటచే ఇప్పుడు నీ కీర్తితో పాటు మిక్కిలి కృశించిపోయినది. ఎల్లప్పుడు మణి పీఠమునందున్నట్టి నీ చరణములను పూర్వము రాజుల శిరస్సు లందలి పుష్ప మాలికల పరాగము రంజిల్ల జేయుచుండెడిది. అట్టి నీ చరణములు నేడు మృగములచే విప్రుల చేతను త్రుంచబడిన యగ్రములు గల దర్భలపై సంచరించుచున్నవి!

ఇటువంటి దురవస్థ కలుగుటకు గారణము శత్రువుల కాపట్యమే యగుటచే నా మనస్సు సమూలముగా పెకలింపబడుచున్నదా యన్నట్లున్నది. శత్రువులచే అపహరింప బడని వీర్యముగల అభిమాన వంతులకు మాత్రము అవమానములు కూడ ఉత్సవములుగానే యుండును. కావున ఓ ప్రభూ! శాంతిని విడిచి పూర్వపు ప్రతాపమును మరల వహింపుము. మమ్ము దయ జూడుము. శత్రువులను సంహరింపక శాంతముచేతనే మోక్షము పొందుట నిష్కాములైన మునులకు శక్యమగునుగాని, రాజ్యము పొందుట రాజులకు సాధ్యముకాదు తేజశ్శాలురలో అగ్రేసరులు, యశస్సే ధనముగా వారునైన తమ వంటివారు సహింపశక్యముగాని యిటువంటి యవమానము పొందియు తృప్తి వహించి యూరకుందురేని అయ్యో! అభిమానశాలిత్వము దిక్కులేనిదై నశించి పోవును గదా!

ఒకవేళ పరాక్రమమును విడిచి శాశ్వతముగా సహనమునే సుఖ సాధనముగా స్వీకరింపదలంచితివి గాబోలు. అట్లయినచో రాజ చిహ్నమైన కార్ముకమును విడిచి జడలు ధరించి ఈ యరణ్యమున అగ్నికి హోమము చేయుచు నుండుము. శత్రువులు అవమానము చేయుటయే ప్రధాన లక్ష్యము గలవారై యున్నప్పుడు తేజశ్శాలివైన నీకు ప్రతిజ్ఞా పాలనము ఉచితమైనది కాదు. ఏలన, విజయార్థులైన రాజులు శత్రువులపట్ల కపటముతో సంధి భంగములు చేయుచుండుట రాజనీతి.

విధి వశమునను, కాలవశమునను అగాధమైన యాపత్సముద్రమున మునిగి ప్రతాపమును, ఐశ్వర్యమును గోల్పోయి యున్న నిన్ను శత్రు తిమిరమును చిందరవందర చేసి దినారంభమున నుదయించుచున్న సూర్యునివలె కాంతి సంపద మరల వరించునుగాక!

---